

చందమామ సంపుటి: 60 డిసెంబర్ 2007 సంచిక: 12

## ఈ నెల విశేషాలుమ

















## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

కూడనిపనులు నివారించటమూ, మంచిపనులను ప్రేరేపించటమూ, రహస్యాలు దాచటమూ, మంచి గుణాలు వ్యాప్తి చెయ్యటమూ, ఆపదలోనైనా విడిచిపెట్టక పోవటమూ, సమయానికి ఆదుకోవటమూ-ఇవి మంచి మిత్రుడి లక్షణాలని పెద్దలు చెబుతారు.







# సంతృప్తి కలిగించిన సంవత్సరం

కొత్త సంవత్సరానికి చోటివ్వడానికి మరో సంవత్సరం వెనక్కు వెళుతున్నది. 2007వ సం.లో మన దేశం వివిధ రంగాలలో ముఖ్యంగా ఆర్థిక, సమాచార-సాంకేతిక రంగాలలో చెప్పుకోతగ్గ ప్రగతిని సాధించిందనే చెప్పాలి. ఇది సంతృప్తి నిచ్చిన సంవత్సరంగా ప్రజల మనసులలో నిలిచిపోతుంది.

దేశ స్వాతంత్ర్య వజ్రోత్సవాలతో పాటు చందమామ కూడా అరవై ఒకటవ సం.లో అడుగుపెట్టడం మనకందరికీ సంతోషం కలిగించిన మరో విషయం.

భారతీయ సంతతికి చెందిన సునీతా విలియమ్స్ అంతరిక్షంలో 196 రోజులు గడిపి రికార్డు సృష్టించారు. భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ పిఎస్ఎల్వి నీ, జిఎస్ఎల్వి శాటలైట్‌నూ అంతరిక్షంలోకి విజయవంతంగా ప్రయోగించింది. ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి సంయుక్తంగా అందుకుంటూన్న రెండింటిలో ఒకటైన-ఇంటర్ గవర్నమెంటల్ ప్యానల్ ఆన్ క్లైమేట్ చేంజ్ సంస్థ అధ్యక్షుడు భారతీయ విజ్ఞాన వేత్త డా. రాజేంద్ర కె. పచారి. ఇక క్రీడారంగంలో ట్వంటీ20 క్రికెట్‌లో ఇండియా ప్రపంచ ఛాంపియన్ అయింది. విశ్వనాథన్ ఆనంద్ చదరంగంలో ప్రపంచ ఛాంపియన్ అయ్యాడు. ఇవన్నీ కూడా మన దేశ కీర్తిచంద్రికలను దశదిశలా వ్యాపింపజేసేవే!

ఇక చందమామ అరవై యేళ్ళు నింపుకుని ముందుకు సాగుతున్నందుకు మూడు తరాల అభిమాన పాఠకులు, శ్రేయోభిలాషులు, ప్రముఖులు, పెద్దలు తమ ఆనందాన్నీ, శుభాకాంక్షలనూ తెలియజేశారు. చందమామ అరవై యేళ్ళు నింపుకుంటూన్న ఈ తరుణంలో-ముంబై జియోడెసిక్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్స్-చందమామ ప్రచురణను డిజిటల్ స్థాయికి తీసుకువెళ్ళి రీయాక్టివేటెడ్ వెబ్‌సైట్ ద్వారా 1947 ప్రారంభ సంచిక నుంచి ప్రపంచ వ్యాప్తంగా ఉన్న లక్షలాది మంది అభిమానులకు అందించడానికి కార్య రంగంలోకి దిగడం మరో శుభపరిణామం!

అయినా, చందమామ ఇంతటితో విశ్రమించకుండా నవతరానికి సేవలందించడానికి నూతన మార్గాలను అన్వేషిస్తూ ముందుకు సాగుతూనే ఉంటుంది!

సంపాదకుడు : **విశ్వం**

















చందమామ

# పాఠకుల లేఖలు

## రూ. 250/- బహుమతి పొందిన లేఖ

చిన్నపిల్లల పత్రిక ఇంతకాలం చిరంజీవిగా నిలబడడం భారత దేశ పత్రికారంగంలో ఓ సరికొత్త సంచలనమైతే... అరవై వసంతాలుగా వయోభేదం లేకుండా అందరినీ అలరించడం మరో మహాద్భుతం. వివిధ భారతీయ భాషల్లో, వివిధ వినూత్న శీర్షికలతో ఓ నూతన ఒరవడిని సృష్టించడం వల్లే ఇది సాధ్యమయింది. చందమామ చదవడం ఒక అందమైన అనుభవం. కాల్పనికతలో కూడా సాక్షాత్కరింప జేయగలదు వాస్తవలోకం. ఎన్నో మధురానుభూతులను మనసులో పదిలపరుస్తుంది. ప్రతి ఒక్కరికీ నిత్య జీవితంలో స్నేహితులుంటారు. శత్రువులుంటారు. శత్రువును క్షమించడమనేది ఒక్క మానవీయతకే చెల్లు. పీటర్ మిల్లర్‌లోని మానవత్వాన్ని గుర్తించి మైఖేల్ విట్మన్‌కు క్షమాభిక్ష ప్రసాదించిన జార్జ్ వాషింగ్టన్ మానవత్వమున్న మహామనీషి కనుకనే ఎదుటి వ్యక్తిలోని క్షమాగుణమనే పరిమళాన్ని ఆఘ్రాణించ గలిగాడు. ఈ సత్యం అక్టోబర్ 2007 సంచికలోని 'అధ్యక్షుడి క్షమాభిక్ష' నిరూపించింది.

ప్రేమానురాగాలు, ఆత్మీయతలకు సమీకరణలు మారిపోతున్న ఈ రోజుల్లో ఇటువంటి మహనీయుల వెలకట్టలేని నైజాలు కొందరి ఆలోచనా ధోరణులలోనైనా మార్పు తీసుకురాగలవు. అలాగే 'మనం మారితే ప్రపంచం మారుతుంది' అన్న సుభాషితానికి విలువకట్టగలమా? గాంధీజీ నైతిక సూత్రాలను అనుసరించడమే మనం ఆయనకు సమర్పించే నిజమైన నివాళి. దయ్యం చేసిన పెళ్ళి, పాతికేళ్ళ నాటి చందమామ కథ ఆకట్టుకున్నాయి. నేను చిన్నతనం నుంచి చందమామ అభిమానిని. అప్పటికీ, ఇప్పటికీ భాషలోగానీ, బొమ్మలలోగానీ, వివిధ ఆసక్తికర శీర్షికలలోగానీ నాణ్యత పరంగా మార్పులు చోటుచేసుకోలేదు. గనుకనే చందమామ 'ప్రపంచ పాఠకుల సంపదగా' ఎదిగింది. చిన్నారులలో వ్యక్తిత్వవికాసం, సృజనలతో పాటు వారిని ఉత్తమ భావిభారత పౌరులుగా, సమాజహితమును కోరే వారుగా, తయారు చేసేదిశలో మన పత్రిక నిర్మాణాత్మక ఆలోచనలతో ఒక అడుగు ముందుకువేయాలని ఆకాంక్షిస్తున్నాను. మన జాతి సంపదయిన చందమామను వెలుగుజిలుగులతో ప్రతి ముంగిట నిలపాలంటే ఒక చక్కని మార్గం ఆలోచించాలి. ప్రతి నెల కొన్ని ఎంపిక చేసుకున్న పాఠశాలల్లో 'చందమామ'పై ఇష్టాగోష్ఠి కార్యక్రమం ప్రారంభిస్తే పత్రిక మరింతమందికి చేరువయ్యే అవకాశముంది. అందుకు తగ్గ కృషి నేనూ చేయగలనని సవినయంగా విన్నవించుకుంటున్నాను. చందమామ ప్రయాణంలో, పురోగతిలో పాఠకులనూ భాగస్వాములను చేయండి. అదే మాకు మంచి వరం. విలువకందని గొప్ప బహుమానం.

-షీభా జోసెఫ్, హైదరాబాద్-500 044


చందా

ఎయిర్‌మెయిల్‌ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.


**ఉత్తమ లేఖకు బహుమతి!**

'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం.

-సం.


**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20
*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
JVL Plaza, 6th Floor
626(Old 501), Anna Salai
Teynampet, Chennai-600018
E-mail :
subscription@chandamama.com



# ప్రాప్తం

భానుచంద్రుడి గురుకులంలో విజయ దశమినాడు నూతన విద్యార్థులను చేర్చుకోవడంతో పాటు, ఎక్కడెక్కడి నుంచో పూర్వ విద్యార్థులు వచ్చి, విద్యాజ్యోతిని ప్రసాదించిన గురువుకు కృతజ్ఞతలు చెప్పుకుని వెళ్ళడం సంప్రదాయం.

ఒకనాడు అలా వచ్చిన వారిలో కొందరు ఎంతో ఉత్సాహంగానూ, మరికొందరు నిరుత్సాహంగానూ ఉండడం గమనించిన గురువు, ''జీవితం అన్నది ఒక విజయానికీ, మరో విజయానికీ మధ్య ప్రయాణం. అవకాశాలు సోపానాల్లాంటివి. అవకాశాలు అందరికీ సమానంగా ఉండవు. ఒకవేళ ఉన్నా వాటిని సద్వినియోగ పరచుకోవడం అందరివల్లా సాధ్యంకాదు. అలా వినియోగించుకోకపోవడానికి వారి వారి మనోభావాలే కారణం. దీనినే మనపెద్దలు ప్రారబ్ధం, ప్రాప్తం అన్నారు. అవసరాలకు అనుగుణంగా మన మనోభావాలను మార్చుకోగలిగితే మాత్రం అభ్యుదయం, ఆనందం కరతలామలకాలే. ఏ రంగంలో వున్నా, ఏ వృత్తిని చేపట్టినా విజయం తప్పక సిద్ధిస్తుంది. ఈ విషయం తేటతెల్లం కావడానికి ఒక చిన్న కథ చెబుతాను, వినండి, అంటూ ఇలా చెప్పసాగాడు:

కృష్ణపట్నానికి చెందిన భక్తులు కొందరికి హంసలదీవికి ఆవలనున్న పగడాలదీవి లోని పరమేశ్వరి అమ్మవారి దర్శనం చేసుకోవాలని చాలాకాలం కోరికగా ఉండేది. ఒకనాడు వాళ్ళు కావలసిన ఆహార పదార్థాలు సిద్ధం చేసుకుని పడవలో బయలుదేరారు. ఆ రోజంతా ప్రయాణం సాఫీగానే సాగింది. సూర్యుడు అస్తమిస్తూండగా, హఠాత్తుగా ఆకాశం మేఘావృతమై గాలివాన ఆరంభమయింది. అర్ధరాత్రి దాటే సరికి అది తుఫా

నందిరాజు పద్మలతా జయరాం



నుగా మారడంతో భక్తుల హాహాకారాల మధ్య పడవ తల్లకిందులయింది.

ఆ పడవలోని ముగ్గురు మాత్రం తెల్లవారుతూండగా సముద్ర మధ్యంలోవున్న ఒకానొక దీవి ఒడ్డున ప్రాణాలతో బయటపడ్డారు. పూజారి నారాయణ, చిల్లరవ్యాపారి భూషయ్య, బిచ్చగాడు రమణయ్య అనే ఆ ముగ్గురికి బతికి ఉన్నందుకు ఆనందం కలిగిందిగాని, నిర్మానుష్యంగా ఉన్న ఆ ప్రదేశంలో ఏం చెయ్యాలో, ఎలా ఉండాలో తెలియలేదు. దీవిలో కొబ్బరి, ఖర్జూర చెట్లు, ఎర్రటి రామాఫలాలు పుష్కలంగా దొరకడంతో కొద్ది రోజుల పాటు ఆకలి బాధ తీర్చుకోవచ్చునని అనుకున్నారు.

''తిండి సంగతి సరే. ఉండేందుకు గూడు, కట్టేందుకు గుడ్డ లేకపోతే ఎలా? జగన్మాత దర్శనానికి వచ్చిన మన గతి ఇలా అయిపోయిందే. మన ఆచూకీ కూడా మన వాళ్ళకు తెలిసే అవకాశం లేదు కదా! మానవ మాత్రులం. మనం ఏం చేయగలం? ఆ జగదంబ సంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుంది,'' అన్నాడు నారాయణ నిట్టూరుస్తూ.

''ఇన్ని కొబ్బరికాయలు, ఖర్జూరకాయలు వృథాగాపండిఎండిపోతున్నవి. వీటితో వ్యాపారం చేస్తే లక్షలు ఆర్జించవచ్చు. కానీ కొనే నాథుడేడీ? సముద్రం మీద నావలు కనిపిస్తాయేమో మీరూ గమనిస్తూండండి,'' అన్నాడు భూషయ్య ఆశగా.

''కావలసినంత తిండి దొరుకుతోంది. తోటివాళ్ళతో గొడవలు పడకుండా కడుపు నిండా తిని, ఒళ్ళు అలవకుండా విశ్రాంతి తీసుకోక ఎందుకీ ఆలోచనలు?'' అన్నాడు రమణయ్య తేలిగ్గా.

రోజులు గడుస్తున్న కొద్దీ భూషయ్యకూ, నారాయణకూ ఇంటిబెంగ పట్టుకున్నది.

ఒకనాడు తీరం వెంబడి తిరుగుతున్న నారాయణకు సముద్రం నుంచి కొట్టుకు వచ్చిన ఒక శిలలో దేవతారూపం కనిపించింది. దాన్ని జాగ్రత్తగా తీసుకువచ్చి, దీవి మధ్యలో వున్న గుట్ట మీద ప్రతిష్ఠించి పూజలు చేయడం మొదలుపెట్టాడు. తనకు వచ్చిన స్తోత్రాలూ, శ్లోకాలూ వల్లిస్తూ ఒంటరిగా ఉన్నానన్న భావనను దూరం చేసుకోసాగాడు.

భూషయ్య ధ్యాసంతా వ్యాపారం మీదే ఉన్నప్పటికీ, విగ్రహానికి రోజుకోసారి భక్తితో దణ్ణం పెట్టుకునేవాడు.

''ఇదే విగ్రహం మన ఊరిగుళ్ళో ఉంటే, వచ్చే పోయే భక్తులు వేసే నాణాలతో నా బతుకు వెళ్ళిపోయేది. ఇక్కడ దేవతకే దిక్కు లేదు. నాకెవరు బిచ్చం వేస్తారు?'' అనుకునే వాడు రమణయ్య విరక్తిగా.

అయితే, నిజంగానే దివ్యత్వం గల ఆ విగ్రహానికి వీరి ముగ్గురిపైనా జాలికలిగింది. ఒకనాటి రాత్రి దేవత నారాయణ కలలో కనిపించి, ''నువ్వు పూజించే దేవతను నేనే. త్వరలో మీ ముగ్గురికీ ఈ ఒంటరి జీవితం ముగిసి పోయేలా చేస్తాను. నాకు ఇదే చోట పూజలు ఆగకుండా గుడి కట్టిస్తావా?'' అని అడిగింది.

''ఎంత మాట తల్లీ! నా జన్మాంతం నీకు సేవచేస్తాను. నా కుటుంబంతో నన్ను కలుపు,'' అన్నాడు నారాయణ భక్తిగా.

''అయితే రేపు తెల్లవారుతూనే జాలర్లు కొందరు ఈ దీవికి వస్తారు. వాళ్ళ ద్వారా మీ సమాచారాన్ని మీ కుటుంబాలకు పంపండి. వారం తరవాత మళ్ళీ మీకు దర్శనమిస్తాను,'' అంటూ అంతర్థాన మయింది దేవత.

నారాయణ మాటలను భూషయ్య, రమణయ్య నమ్మలేదు. కానీ, మరునాడు మిట్ట మధ్యాహ్న సమయంలో దూరాన ఉన్న జాలరి గూడానికి చెందిన జాలర్లు కొందరు దారితప్పి పడవలతో సహా ఈ దీవికి రావడంతో, నారాయణ కల నిజమయిందని నమ్మక తప్ప లేదు. జాలర్లు వీరి ముగ్గురినీ అక్కడ చూసి ఆశ్చర్యపోయారు. గుట్ట మీది దేవతకు మొక్కుకుని, తిరిగి తమ గూడానికి చేరి, కృష్ణపట్నానికి వాళ్ళ ముగ్గురి గురించి సమాచారం అందించారు.



నారాయణ, భూషయ్య భార్యాపిల్లలు, బంధువులు, రమణయ్య తోటిబిచ్చగాళ్ళు బిలబిలా దీవికి చేరారు. పెద్ద ఎత్తున అమ్మ వారికి పూజలు మొదలయ్యాయి.

అన్నట్టుగానే ఏడో రోజున అమ్మవారు ముగ్గురికీ కలలో కనిపించి, ''మీ భక్తికి సంతోషం. మనిషికొక వరం ఇస్తాను. కోరు కోండి,'' అన్నది.

''ఎప్పుడూ నీ సేవచేసుకుంటూ జీవిం చేట్టు వరమివ్వు, తల్లీ,'' అన్నాడు నారాయణ.

''నిన్ను నమ్ముకున్న వాణ్ణి, నాకు వ్యాపారం బ్రహ్మాండంగా సాగి గొప్ప ధనవంతుణ్ణయి, భార్యాపిల్లలతో హాయిగా ఉంటూ కృష్ణ పట్నంలో నీకు వేరొక దేవాలయం కట్టేలా ఆశీర్వదించు,'' అన్నాడు భూషయ్య.

''తల్లీ! నాకో వెండి భిక్షాపాత్ర ప్రసాదిం చమ్మా! నీ పేరు చెప్పుకుని బిచ్చమెత్తుకుం టాను,'' అన్నాడు రమణయ్య.

''తథాస్తు!'' అని దీవించింది దేవత.

భక్తులు వచ్చిన రోజున, తనకు దక్షిణ ఇచ్చిన రోజున మాత్రమే కడుపునిండా తింటూ, లేని రోజున పస్తులుంటూ, సదా సర్వవేళలా అంబను ధ్యానిస్తూ తృప్తిగా జీవిం చాడు నారాయణ.

దీవిలోని కొబ్బరి, ఖర్జూర కాయలతో ఎగుమతి వ్యాపారం ప్రారంభించి అనతి కాలంలోనే లక్షలకు లక్షలు గడించాడు భూషయ్య.

'వెండి బొచ్చెతో బిచ్చం ఎత్తుకునే వాడివి, నీది ఒళ్ళు బద్ధకం తప్ప పేదరికం, నిస్స హాయత కాదు,'' అంటూ అక్కడికి వచ్చే వారెవ్వరూ దమ్మిడీ వేయక పోవడంతో మరో చోటు వెతుక్కున్నాడు రమణయ్య.

ఈ కథ విన్న శిష్యులు గలగలా నవ్వారు. అప్పుడు గురువు, ''చూశారా, ముగ్గురూ వైభవాన్ని అడిగివుంటే దేవత తప్పక ఇచ్చి ఉండేది. కాని ఎవరి ప్రాప్తాలను బట్టి వారి బుద్ధులు పనిచేశాయి. వాటిని బట్టి జీవి తాలు మారాయి. కాబట్టి జీవితాలు మారా లంటే మొదట మన బుద్ధులు మారాలి. అప్పుడే ఎదురయ్యే అవకాశాలను సద్విని యోగం చేసుకోగలం,'' అన్నాడు.





# వైద్యుడి ఎంపిక

వృద్ధురాలైన రాజమాత నాగమాంబకు ఉన్నట్టుండి విపరీతమైన మోకాళ్ళనొప్పులు ఆరంభమయ్యాయి. రాజవైద్యులు ఎంత ప్రయత్నించినా ఆ వ్యాధిని నయంచేయలేకపోయారు. లేచి నిలబడడానికీ, నడవడానికీ తల్లి పడే యాతన చూసి మహారాజు వీరసింహుడు వేదనకు లోనయ్యాడు. రాజుగారి విచారాన్ని గమనించిన ప్రధాన మంత్రి, ''మహారాజా, రాజమాత అస్వస్థతకు ప్రకృతి వైద్యం చేయిస్తే ఫలితం కనిపించవచ్చు,'' అన్నాడు.

ఆ మాట వినగానే రాజుకు తల్లి ఆరోగ్యం గురించి కొత్త ఆశలు పుట్టుకొచ్చాయి. వెను వెంటనే దేశమంతటా చాటింపు వేయించి దేశం నలుమూలల నుంచి ప్రకృతి వైద్యులను రప్పించారు. వారి అర్హతలను, అనుభవాలను పరిశీలించి ప్రధానమంత్రి నలుగురు వైద్యులను రాజమాత వైద్యానికి నియమించాడు.

వాళ్ళ నలుగురూ కలిసి రాజమాతకు ఏమాత్రం కష్టం కలగకుండా, వైద్యం ప్రారంభించారు. ఆమె తీసుకునే ఆహారంలో మార్పులు చేశారు. అడవిలోని కొన్నిరకాల ఆకులను తెచ్చి, ఆముదంలో దోరగా వేయించి మోకాళ్ళకు కట్టు కట్టేవారు. ఆవిరి, తైలధార పద్ధతులలో కొన్ని రోజులు క్రమం తప్పకుండా చికిత్స చేశారు. దాంతో మూడు వారాలకల్లా రాజమాతకు నొప్పి తగ్గిపోయింది. ఊతకర్ర సాయం కూడా లేకుండా మునుపటికన్నా ఎంతో ఉత్సాహంగా, హాయిగా లేచి నడవసాగింది.

తల్లిని చూస్తూంటే మహారాజుకు సంతోషం కలిగింది. తల్లికి వైద్యం చేసిన నలుగురిలో ఒకరిని ఆస్థాన ప్రకృతి వైద్యుడిగా నియ

గుడిసేవ మురళీధర్

మించాలనుకున్నాడు రాజు. అయితే, నలుగురూ ఒకే వయసు, అనుభవం కలిగిన వారే. ఎవరిని నియమించడమా అన్న సందిగ్ధంలో పడ్డ రాజు ఆ విషయంగా మంత్రిని సంప్రదించాడు.

"ఇందులో పెద్దగా ఆలోచించవలసినదేమీ లేదు. నలుగురూ వైద్యంలో నిపుణులే గనక, ఆ నలుగురిలో తమకు నచ్చిన వ్యక్తికి ఆ పదవి ఇవ్వండి ప్రభూ," అని సలహా ఇచ్చాడు మంత్రి.

రాజు ఆ నలుగురిలో సంగమేశ్వరశాస్త్రిని ఆస్థాన ప్రకృతి వైద్యుడిగా నియమించి, తక్కిన ముగ్గురికి విలువైన కానుకలిచ్చి పంపాడు.

ఆ రోజు సాయంకాలం మంత్రితో కలిసి ఉద్యానవనంలో పచార్లు చేస్తూండగా రాజు ప్రకృతి వైద్యుడి నియామకం గురించి ప్రస్తావించాడు. అప్పుడు మంత్రి, "మహారాజా! ఆ నలుగురిలోకీ సంగమేశ్వరశాస్త్రి అద్భుతమైన వైద్యుడు. అందులో ఏమాత్రం సందేహం లేదు," అన్నాడు.

"ఏ ఆధారంతో అంతరూఢిగా చెప్పగలుగుతున్నావు?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

"ప్రభువుల మన్నన, గుర్తింపు పొందాడంటే అతడు తప్పక ఉత్తమ వైద్యుడేకదా!" అన్నాడు మంత్రి చిన్నగా నవ్వుతూ.

మంత్రి లౌక్యానికి మనసులో నవ్వుకున్న రాజు, "చికిత్సా విధానంలో ఆ నలుగురూ ఆరితేరినవారే. అయితే, సంగమేశ్వరశాస్త్రి మాత్రం చికిత్స ప్రారంభించిన తొలి రోజు నుంచే వ్యాధి తప్పక నయమవుతుందని తల్లిగారి మనసులో విశ్వాసం కలిగిస్తూ వచ్చాడు. ఆ సంగతి తల్లిగారే నాతో చెప్పారు. వైద్యుడన్న వాడు స్పష్టమైన రోగ నిర్ధారణ చేసి, సరైన మందులు వాడాలి; చక్కని చికిత్సా విధానంతోపాటు, రోగి మనసులో నమ్మకం కలిగించేవాడుగా ఉండాలి. చికిత్స పొందుతున్న వారిలో ఆత్మవిశ్వాసం పెంపొందించగలవాడుగా ఉండడం చాలా ముఖ్యం. ఆ లక్షణం సంగమేశ్వరశాస్త్రిలో ఉండడం వల్లే అతన్ని ఎంపిక చేశాను," అన్నాడు.






# రాకాసిలోయ

## 28

[బ్రహ్మదండి మాంత్రికుడు, కేశవుడూ వాళ్ళు, కొండ గుహల్లో దాగి వున్నారని గ్రహించాడు. ఆ వెంటనే అతడు వాళ్ళను ఎలాగైనా బయటకు రప్పించాలని ఒక పథకం ప్రకారం స్థూలకాయుణ్ణి కొండ దగ్గిరకు పంపి, తామంతా అతడికి బానిసలుగా దొరికినట్టు, కేకలు వేయించాడు. అది విన్న కేశవుడూ అతడి అనుచరులూ గుహనుంచి బయటకు వచ్చి, స్థూలకాయుడి కేసి మెల్లగా పాకుతూ రాసాగారు. -తరవాత]

కేశవుడు నిశ్శబ్దంగా పాకుతూ పోయి, స్థూలకాయుడు నిలబడి వున్న రాతి వెనక ఆగి, కత్తిని అతడి కాళ్ళకు అడ్డంగా ఆనించి, ''స్థూలకాయా! చెప్పేది నిశ్శబ్దంగా విను. అటూ ఇటూ గెంతటంగాని, నీ వెనక ఎవరో వున్నట్టు సూచనగాని చేశావో, నీ రెండు కాళ్ళూ ఒక్క వేటుకు తెగిపోగలవు,'' అన్నాడు గొంతు తగ్గించి మాట్లాడుతూ.

స్థూలకాయుడు ఒక క్షణకాలం స్తంభించి పోయాడు. తరవాత నిలువెల్లా ఓసారి వణికి పోయాడు. ప్రాణభీతితో ఒక్కసారిగా అరుద్దామనుకున్నాడు. గాని, కేశవుడి హెచ్చరికా, పదునుగా కాళ్ళకు ఆనించబడి ఒరుసుకుంటున్న కత్తీ, అతడి బుద్ధిని అదుపులో పెట్టినై.

''ఎవరు నువ్వు? కేశవుడివి కాదు గదా?'' అన్నాడు స్థూలకాయుడు వినపడీ వినపడనట్టు.

''నేను కేశవుణ్ణే! నా వెనక పదీ పదిహేను మంది కత్తులవాళ్ళూ, బాణాల వాళ్ళూ

'చందమామ'



వున్నారు. కదిలావో, చచ్చినవాడివే! ఇక చెప్పు! నువ్వు, నిజంగా బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ ఆ పక్షివేషంవాణ్ణీ బానిసలుగా పట్టుకు న్నావా? లేక అంతా కపట నాటకమా?'' అని ప్రశ్నించాడు కేశవుడు.

''అంతా కపట నాటకమే. ఆడేది నేనైనా, ఆడిస్తున్నవాడు ఆ మాంత్రిక వెధవ. ప్రాణ భయం కొద్దీ వాడు చెప్పినదానికి ఒప్పుకు న్నాను. నన్ను చంపకు, నీ పుణ్యముంటుంది,'' అంటూ స్థూలకాయుడు బావురుమన్నాడు.

స్థూలకాయుడు బొమ్మలా కదలామెదలకనిలబడి వుండి, పెదాలు మాత్రం ఆడిస్తూ ఏవో ధ్వనులు చేస్తూ వుండటం, అల్లంత దూరంలో వున్న చెట్ల చాటు నుంచి గమని స్తున్న బ్రహ్మదండికీ, పులుగు రాయుడికీ ఆశ్చర్యం కలిగించింది. ''వాడట్టా ఎండు మానులా నిద్ర నిగడ దీసుకు పోయాడేం? ఏదైనా గుర్రపువాత రోగం కాదు గదా?'' అన్నాడు పులుగు రాయుడు కోపంగా.

బ్రహ్మదండి ఆ ప్రశ్నకు అడ్డంగా తలాడిస్తూ, ''అలాంటిదేం కాదని నా అను మానం. వాడు మనం వేసిన గాలం! ఆ గాలానికి చేప పడిందని నాకు తోస్తున్నది. అయినా సంశయం ఎందుకు? ఒకసారి సౌంజ్ఞ చేసి చూద్దాం. జవాబు వస్తుందో లేదో తెలిసి పోతుంది,'' అంటూ తన మంత్రదండాన్ని పైకెత్తి, స్థూలకాయుడికేసి ఆడించాడు.

బ్రహ్మదండికి జవాబిచ్చేందుకు స్థూల కాయుడు తన చేయి ఎత్తబోయి, అంతలో కేశవుడి కత్తి, కాళ్ళను మరింత గట్టిగా ఒరుసు కోవటంతో ఆగిపోయాడు.

కేశవుడు తన పక్కనే వున్న జయమల్లూ, కోయగోమాంగ్‌ల కేసి తల తిప్పి, ''వీడేదో తన మిత్రులకు చెప్ప చూస్తున్నట్టున్నది,'' అన్నాడు.

''అందుకు సందేహం లేదు. కాని, మనకు రానున్న ప్రమాదం ఆలోచించావా? ఆ బ్రహ్మ దండీ, పక్షిముఖం వాడూ ఈ సరికే మనను పట్టేందుకు, తమ అనుచరులతో బయలు దేరి వుండవచ్చు,'' అన్నాడు జయమల్లు.

కేశవుడు తన కత్తిని స్థూలకాయుడి మోచేతికి ఒకసారి తాకించి, ''నిజం చెప్పకపోయావో, నీ కాళ్ళతోపాటు, చేతులు కూడా నరికేస్తాను. ఇప్పుడు బ్రహ్మదండీ, పక్షిముఖం వాడూ ఏం చేస్తున్నారు?'' అని అడిగాడు.

''వాళ్ళిద్దరూ తలలొక చోట చేర్చారు; ఏదో రహస్యాలోచన చేస్తున్నట్టున్నది. జితశక్తి వర్మలు తమ కత్తుల్ని చెట్టు బోదె మీద సాన బెడుతున్నారు,'' అన్నాడు స్థూలకాయుడు.

వాడు చెప్పిన దాంట్లో అబద్ధం ఏమీ లేదు. బ్రహ్మదండీ, పులుగురాయుడూ కలిసి ఆస రికే కొందరు రెక్కల మనుషుల్ని, శత్రుబల మేపాటో తెలుసుకు వచ్చేందుకు పంపారు. వాళ్ళల్లో కొందరు పెద్ద పెద్ద వృక్షాలెక్కి, అక్క ణ్ణించి రాతి మీద నిలబడి వున్న స్థూలకా యుణ్ణీ, ఆ వెనక నక్కివున్న కేశవుణ్ణీ, జయ మల్లునూ, కోయగోమాంగ్‌నూ చూశారు.

"ఇంతకూ శత్రువులు ముగ్గురే ముగ్గురు! పిల్లికూనల్ని పట్టినట్టు వాళ్ళను మెడలు పట్టి ఇవతలికి ఈడ్వవచ్చు," అనుకుంటూ రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు పరిగె త్తుకు వెళ్ళి, తాము చూసింది చెప్పారు.

తన అనుచరులు ఇచ్చిన భోగట్టా వింటూనే, పులుగురాయుడు కనుబొమలు ముడిచి, "ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది, బ్రహ్మదండీ! ముగ్గురే ముగ్గురు మానవమాత్రులు, ఇంత ధైర్యంగా మన మధ్యకు వస్తారంటే నేను చచ్చినా నమ్మను," అన్నాడు.

"వాళ్ళ సంగతి తెలియకపోతే నేనూ నమ్మను!" అంటూ బ్రహ్మదండి పెద్దగా నవ్వి, "వాళ్ళల్లో ఒకడు కేశవుడూ, రెండవవాడు జయమల్లనే నా పూర్వ శిష్యుడూ. పోతే, ఆ మూడవవాడు కోయశుంఠ అయివుంటాడు. ఆ ముగ్గురూ మహిష లగ్నంలో పుట్టిన వాళ్ళు. ఆ జాతకులకు వెనక చూపూ వుండదు, ముందు చూపూ వుండదు. ఏటికి అడ్డంపడి ఈదటమే," అన్నాడు.

"అయితే ఇప్పుడు మనం చేయవలసిందే మిటి?" అన్నాడు పులుగురాయుడు.



"ఏముంది, వాళ్ళ ముగ్గుర్నీ చుట్టు ముట్టి పట్టేద్దాం," అన్నాడు బ్రహ్మదండి.

"వాళ్ళూ, బాణాలూ, కత్తులూ వెంట వుంచుకు తిరిగేవాళ్ళే. అంత తేలిగ్గా దొరకు తారని నేననుకోను. మనలో చాలామందిమి చావ వలసి వస్తుంది. ముందు ఆ స్థూలకా యుణ్ణి వాళ్ళు చంపేస్తారు," అన్నాడు పులుగురాయుడు.

"వాడు నరభక్షకులకు దొరికి ఎప్పుడో చచ్చినవాడే, నేను ప్రాణం పోసి వెంట బెట్టుకు వచ్చాను. ఇవ్వాళ్టితో వాడికి ఆయుష్షు తీరి పోయిందనుకుందాం! పోతే, నువ్వూ నేనూ ఎంతో కాలం బతికి వుండి, అర్ధరాజ్యమూ, రాకాసిలోయలోని ధనరాసులూ అనుభ వించ వలసిన వాళ్ళం. అందువల్ల మనం తొందరపడి, ఆ దుర్మార్గుల బాణం వేటుకు అందే దూరంలోకి వెళ్ళకూడదు. నీ నా అనుచ



రుల్ని, వాళ్ళను పట్టితెచ్చేందుకు పంపుదాం,'' అన్నాడు బ్రహ్మదండి.

''అంతే చేద్దాం,'' అంటూ పులుగురాయుడు పక్కకు తిరిగి తన అనుచరులకు సౌంజ్ఞ చేశాడు. వెంటనే ముప్ఫై నలభై మంది రెక్కల మనుషులు తమ నాయకుడి దగ్గిరకు వచ్చారు. పులుగురాయుడు వాళ్ళతో కొంచెం సేపు రహస్యంగా మాట్లాడి, ఇక వెళ్ళ మన్నట్టు చేతులు వూపాడు. రెక్కల మనుషులు రెండు ముఠాలుగా చీలిపోయి, కొందరు చెట్ల మీదికి ఎక్కసాగారు. మరి కొందరు రాళ్ళ వెనక నక్కుతూ, స్థూలకాయుడున్న ప్రదేశానికి బయలుదేరారు.

''ఏం, జితా, శక్తీ! మీ రిక్కడే వున్నారేం? ఆ కేశవుడూ వాళ్ళను పట్టేందుకు సాయపడరా?'' అని అడిగాడు పులుగురాయుడు జిత శక్తివర్మలను.

ఆ ప్రశ్న వింటూనే జిత శక్తివర్మలు పదును పెడుతున్న కత్తులను ఒరలలో పెట్టి, ''ఆ నీచుల్ని పట్టుకుని, మా చేతుల్ని మలినం చేసుకుంటామా! మా పని బ్రహ్మదండి మాంత్రికుడి అంగరక్షణ చేయటం. బ్రహ్మపుర రాజగురువు మమ్మల్ని పంపింది అందుకేగదా, బ్రహ్మదండీ?'' అంటూ మాంత్రికుణ్ణి ప్రశ్నించారు.

బ్రహ్మదండివచ్చే కోపాన్ని బలవంతంగా దిగమింగుతూ, ''అవును, అవును,'' అంటూ తలాడించాడు.

ఈలోపల రెక్కల మనుషులు తమ మీద దాడికి వస్తున్నట్టు ముందుగా చూసి, కేశవుడికీ, జయమల్లుకూ కోయగోమాంగ్ హెచ్చరికచేశాడు. మహావృక్షాల మీదికి పాకిపోతున్న వాళ్ళను చూస్తూనే కేశవుడు నవ్వి, ''ఈ పక్షి వెధవలు అంత ఎత్తు నుంచి, మన మీదికి దూకి, మనను పట్టుకుంటారన్న మాట! సరే, బాణాలు ఎక్కుపెట్టి, ముందు ఒకళ్ళిద్దర్ని పడగొట్టండి, మిగతా వాళ్ళు పారిపోతారు. ఇంతకూ వీళ్ళ నాయకులెక్కడ?'' అన్నాడు విల్లంబులు చేతికి తీసుకుంటూ.

ఆ వెంటనే జయమల్లూ, గోమాంగ్ కూడా తమతమ విల్లంబులు తీసుకున్నారు. కేశవుడు చెట్ల మీదికి పాకుతున్న ఒక రెక్కల మనిషి మీదికి గురిపెట్టిన బాణాన్ని చప్పున దించుతూ, జయమల్లుకేసి తిరిగి, ''జయమల్లూ! వీళ్ళనెంతమందిని చంపినా మనకు కలిగే మేలులేదు. ఆ బ్రహ్మదండిని ముందు మారణం చెయ్యాలి. వాడెక్కడ? వాడూ మన మీదికి వస్తున్నాడా? ఏయ్, స్థూలకాయా!

బ్రహ్మదండి ఇటుకేసి వస్తున్నాడా? నిజం చెప్పు,'' అని స్థూలకాయుణ్ణి ప్రశ్నించాడు.

స్థూలకాయుడు నిలువెల్లా వణికిపోతూ, ''వాడు రావటంలేదు. వాడూ, పిట్టల నాయకుడూ చెట్ల కింద నిలబడి ఇటు కేసే చూస్తున్నారు,'' అన్నాడు.

''ఆ దుర్మార్గుడికి మన శక్తేమిటో తెలుసు, కేశవా! సరే, ఇక మనం ఇక్కడ కాలయాపన చెయ్యకూడదు. ఇద్దరు ముగ్గురు రెక్కల మనుషుల్ని పడగొట్టి, మనం గుహకంతలో నుంచి తిరిగి కొండ పొట్టలోకి వెళ్ళిపోదాం,'' అంటూ జయమల్లు బాణం గురి చేసి చెట్ల మీదికి చరచరా పాకిపోతున్న రెక్కల మనుషుల్లో ఒకడి మీదికి దాన్ని వదిలాడు.

కేశవుడూ, అతడి అనుచరులూ తమ దృష్టిని రెక్కల మనుషుల మీదికి మళ్ళించారని గ్రహించిన స్థూలకాయుడు రాతి మీది నుంచి కిందికి దూకి, కాలి సత్తువ కొద్దీ బ్రహ్మదండీ, పులుగురాయుళ్ళ కేసి పరిగెత్తుతూ, ''వాళ్ళు అంతా కలిసి ముగ్గురే! చంపండి, పట్టుకోండి,'' అంటూ అరవసాగాడు.

''ఆహా, కేశవా! ఈ దుర్మార్గుడు మన నుంచి బతికి బయటపడ్డాడు. అయినా, ఒక దెబ్బ కొట్టి చూద్దాం, తగులుతుందేమో!'' అంటూ కోయగోమాంగ్ లేచి నిలబడి పారిపోతున్న స్థూలకాయుడి మీదికి బాణం వదిలాడు. కాని, ఆ బాణం స్థూలకాయుడి పక్కగా దూసుకుపోయి, బ్రహ్మదండీ, పులుగురాయుడూ నిలబడివున్న చెట్టు బోదెకు ఠపీమని తగిలింది. బాణం చేసిన ధ్వని వింటూనే బ్రహ్మదండి ఎగిరి గంతేసి, ''ఆ దుర్మార్గులు




ముగ్గురూ మన మీదికే బాణాలు వదులుతున్నారు పులుగేంద్రా! పరిగెత్తు!'' అంటూ వెనుదిరిగి చెట్లలోకి పారిపోసాగాడు. పులుగురాయుడూ, జిత శక్తివర్మలూ అతణ్ణి అనుసరించారు.

గోమాంగ్‌తో పాటు కేశవుడూ, జయమల్లూ కూడా లేచి నిలబడ్డారు. వాళ్ళకు పారిపోతున్న బ్రహ్మదండి ముఠా కనిపించింది. వాళ్ళను వెంటపడి తరమటమా, మానటమా అని వాళ్ళు ఆలోచించేంతలో చెట్ల మీది నుంచి, చావగా మిగిలిన రెక్కల మనుషులు భయంకరంగా అరుస్తూ, వాళ్ళ మీదికి ఎగిరి రాసాగారు.

కేశవుడూ, అతడి అనుచరులూ బాణాలు ఒక దాని వెంట ఒకటిగా కిందికి దూకుతున్న రెక్కల మనుషుల మీదికి వదిలారు. వాళ్ళల్లో బాణం దెబ్బలు తగిలిన కొందరు బాధతో

అరుస్తూ, అంత ఎత్తు నుంచి గాలిలో పల్లటీలు కొడుతూ దభీదభీమని కిందపడసాగారు.

ఇక తిరిగి తాము గుహలో ప్రవేశిద్దామని కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకుని వెనుదిరిగేంతలో, రెక్కల మనుషుల్లోరెండవ ముఠా రాళ్ళ చాటు నుంచి ఒక్కుమ్మడిగా గావు కేకలు పెడుతూ, లేచి నిలబడ్డారు. వాళ్ళందరి వద్దా పొడవాటి పదునైన ఈటెలు ఉన్నాయి.

"ఇక బాణాలతో లాభం లేదు, కత్తులకు పని చెప్పండి. శత్రువులు మన గుహామార్గాన్ని అడ్డుకున్నారు. పోరాడుతూ వీళ్ళ చక్రబంధం నుంచి బయట పడటం ఒక్కటే ఇప్పుడు మనం చేయవలసింది. మనం వీళ్ళకు దొరక్కుండా ఎటు పారిపోయినా ఫరవాలేదు," అంటూ జయమల్లు కత్తి దూసి రెక్కల మనుషుల్ని ఎదుర్కొన్నాడు.

కేశవుడూ, గోమాంగ్, జయమల్లుల కత్తి దెబ్బలకు రెక్కల మనుషుల్లో ఒక్కొక్కడే చావు కేక పెట్టి కింద పడసాగాడు. వాళ్ళు చేతులకు కట్టుకున్న పక్షిరెక్కలు, ఈ ద్వంద్వ యుద్ధంలో వాళ్ళకు చాలా ఆటంకంగా తయారయినై. వాళ్ళల్లో కొందరు ఈటెలను అటూ ఇటూ తిప్పబోయి, ఆ వేగానికి కట్టుకున్న రెక్కలు ఒకదాన్నొకటి మెలివేసు కోవటంతో, చాప చుట్టల్లా కింద పడసాగారు.

"మనం జయించాం, కేశవా! ఇక, మనం గుహలోకి ప్రవేశించి, క్షేమంగా శ్యానకర్ణి ముఠాను చేరవచ్చు," అంటూ జయమల్లు రెండడుగులు వేసి నిశ్చేష్టుడైపోయాడు.

ఎదురుగా దడి కట్టినట్టు నిలబడిన తన అనుచరులతో పులుగురాయుడు ప్రత్యక్షమయ్యాడు. జయమల్లుతో పాటు, కేశవుడూ, కోయగోమాంగ్ కూడా అటుకేసి చూసి, తరవాత చుట్టూ ఒకసారి కలయచూశారు. వలయాకారంలో తమను రెక్కల మనుషులు వందల సంఖ్యలో చుట్టు ముట్టినట్టు వాళ్ళు గ్రహించారు. బ్రహ్మదండి ఎక్కడ? అన్న అనుమానం వాళ్ళకు కలిగింది. ఆ వెంటనే బ్రహ్మదండి మాంత్రికుడి కంచుకంఠం పలికింది: "ఆ కేశవుణ్ణి మాత్రం ప్రాణాలతో పట్టుకుని, మిగతా ఇద్దర్నీ నిలువునా నరికేయండి!"

-(ఇంకావుంది)





# కష్టమైన పని

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తలపెట్టిన కార్యం ఎన్ని కష్టాలకైనా ఓర్చి, సాధించి తీరాలన్న నీ పట్టుదల ప్రశంసనీయమైనదే. కాని నువ్వు చేపట్టిన కార్యం నీ కోసమా, లేక కపట వర్తనులైన మరెవరి కోసమా అన్నది నాకు తెలియదు. సమర్థులూ, తెలివైనవారూ కూడా ఒక్కొక్కసారి కపటస్వభావుల మాయమాటలు నమ్మి మోసపోతూ ఉంటారు. ప్రతిభా సంపన్నులైన ఇద్దరు యువకులను జనవంద్యుడనే ఒక తపస్వి, మాయమాటలతో వంచించిన కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

బేతాళ కథలు



రాముడు పండితుడు, భీముడు మల్ల వీరుడు, సోముడు జలవిన్యాసాల్లో ఉద్దం డుడు. ఈ ముగ్గురు యువకులు తమ విద్యలను ప్రదర్శించడానికి వెళ్ళినప్పుడు వ్రజపురంలో కలుసుకుని మిత్రులయ్యారు. ఆ గ్రామస్థులు వారి ప్రతిభకు మెచ్చి గ్రామంలో ఉచిత భోజన సదుపాయాలు ఏర్పాటు చేశారు. కాని కొన్నాళ్ళకు వ్రజపురంలో వానలు కురవక కరువొచ్చింది. ముగ్గురు మిత్రులూ కాయకష్టం చేయడం ఇష్టంలేక, వేరే ఊరు వెతుక్కుంటూవెళ్ళి శ్రీనగరం చేరారు. అక్కడ ఒకరోజు ఆశ్రయం కోసం బసవయ్య అనే భాగ్యవంతుడి ఇంటి వద్దకు వెళ్ళారు.

ఆ సమయానికి బసవయ్య ఇంట్లో జన వంద్యుడనే తపస్వి ఉన్నాడు. బసవయ్య ఆతిథ్యానికి సంతృప్తుడై, ''వచ్చే ఏడాదికి నీ కోడలికి పండంటి కొడుకు పుడతాడు,'' అని దీవించాడాయన.

ఆ మాట విని బసవయ్య ముఖం చిన్న బోయింది. ఆయనభార్య విమలమ్మ ''స్వామీ, మాకు సంతానం లేదు. మీ దీవెనతో మాకు కొడుకు పుట్టినా, వాడి పెళ్ళి ఇరవైయేళ్ళ తరవాత కదా!'' అని బాధపడింది.

జనవంద్యుడు క్షణం పాటు కళ్ళు మూసి తెరిచి, ''నేనలా దీవించడం దైవసంకల్పం. ఒక యోగ్యుడైన యువకుణ్ణి దత్తత చేసుకుని పెళ్ళి జరిపించండి. ఏడాదిలో మీ కోడలు మనవడి నెత్తుకుంటుంది,'' అన్నాడు.

బసవయ్య వెంటనే, ''దత్తత చేసుకోవాలని మేమూ అనుకున్నాం. కాని యోగ్యుడెవరో తెలుసుకునేదెలా?'' అన్నాడు.

అప్పుడే రాముడు, భీముడు, సోముడు ఆ ఇంటి తలుపు తట్టారు. వాళ్ళు తమ గురించి చెప్పేలోగా జనవంద్యుడు ఒక్కొక్క రినీ పేర్లతో పిలిచి, ''ఉన్న ఊళ్ళో కరువొచ్చి, కాయకష్టం చేయడం ఇష్టం లేక, మీ ప్రతి భకు తగ్గపని వెతుక్కుంటూ వచ్చారు, అవునా?'' అన్నాడు. ముగ్గురు మిత్రులూ తెల్లబోయి, ''తమరు మహానుభావులు. మీ దర్శనం మా అదృష్టం. మా గురించి అన్నీ తెలిసిన తమరే మాకు తరుణోపాయం చూపాలి,'' అంటూ ఆయనకు నమస్కరించారు.

జనవంద్యుడు వారితో, ''భాగ్యవంతుడైన ఈ బసవయ్యకు సంతానం లేదు. దశరథ పర్వతం మీది వశిష్ట వృక్షానికి కాసిన పుత్ర కామేష్టిఫలం తింటే ఇతడి భార్య సంతానవతి

అవుతుంది. అయితే, ఆ పర్వతం పశ్చిమ దిశలో లేదు. తక్కిన మూడు దిశలలో ఎక్కడు న్నదీ నాకు తెలియదు. మీరు ముగ్గురూ మూడు దిక్కులకు వెళ్ళి ఆ ఫలాన్ని అన్వేషిం చండి. ఫలం తెచ్చినవారికి బసవయ్య ఆస్తిలో సగం ఇస్తాడు. రెండు మాసాల్లో ఫలం ఎవరికీ దొరక్కపోతే-ఫలాన్వేషణలో అందరికంటే ఎక్కువ కష్టపడ్డవాణ్ణి ఆయన దత్తత చేసు కుంటాడు. ఫలాన్వేషణలో ముగ్గురికీ ఉపాధి లభిస్తుంది,'' అన్నాడు.

మిత్రులు ముగ్గురూ ఫలాన్వేషణలో తలో దిక్కుకు బయలుదేరారు.




ఉత్తరం వైపు వెళ్ళిన రాముడు దశరథ పర్వతం గురించి వాకబు చేస్తూ, వంచనుడనే భూస్వామి వద్దకు వెళ్ళాడు. ఆయన అతడి ప్రయాణం గురించి విని, ''దశరథ పర్వతం వివరాలు నిజాయితీపరులకూ, తెలివైన వాళ్ళకూ మాత్రమే చెప్పాలని నియమం. నువ్వు ఆరు వారాలు నేను చెప్పిన పని చెప్పి నట్టు చేసి నమ్మకస్థుణ్ణని నిరూపించుకో. తరవాత నువ్వు తెలివైన వాడివనిపిస్తే, ఆ పర్వతం వివరాలు చెబుతాను,'' అన్నాడు.

ఆ మాట నమ్మిన రాముడు, సరేనని ఆయనవద్ద పనిలో చేరాడు. వంచనుడతని చేత రోజూ పెరడంతా ఊడిపించేవాడు. నీళ్ళు తోడించేవాడు. కట్టెలు కొట్టించేవాడు. అవేవీ తనకు ఇష్టంలేకపోయినా, కార్యసాధనకోసం ఆరువారాలు గొడ్డుచాకిరీ చేశాడు రాముడు. ఆ తరవాత అతడు పర్వతం ఆచూకీ చెప్ప మంటే, ''ఆరు వారాల్లో నమ్మకస్థుణ్ణని రుజువు చేశావు. కానీ ఇప్పుడు దశరథ పర్వతం వివ రాలు చెబితే వెంటనే వెళ్ళి పోగలవు. మరి ఇంత నమ్మకస్థుడయిన పనివాణ్ణి వదులు కుంటానా? ఆమాత్రం గ్రహించలేని నీ తెలివి ఏం తెలివి? నీకు దరశథ పర్వతం వివ రాలు తెలుసుకునే అర్హత లేదు,'' అన్నాడు వంచనుడు.

ఆయనకు పర్వతం గురించి ఏమీ తెలియ దనీ, తను మోసపోయాననీ గ్రహించిన రాముడు, ఉస్సురుమంటూ శ్రీనగరానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

దక్షిణం వైపు వెళ్ళిన భీముడు విచిత్రపుర మనే గ్రామం చేరుకుని తన మల్లవిద్యను ప్రదర్శించాడు. సంతోషించి గ్రామస్థులతణ్ణి అక్కడే స్థిరపడమన్నారు. ప్రస్తుతం తను వచ్చిన కార్యం గురించి చెప్పి, భీముడు



అందుకు తిరస్కరించాడు. దానిని విన్న శిలాద్రుడనే వాడు, ''మా గ్రామానికి కొంత దూరంలో దుర్గమమైన పర్వత శ్రేణి ఉన్నది. నేనొక పర్వతారోహకుణ్ణి. ఆ పర్వతాల విశేషాలు తెలుసుకునేందుకు నీలాంటి బలశాలి తోడు కోసం చూస్తున్నాను. నువ్వు సరేనంటే బయలుదేరుదాం. వాటి మధ్యలో దశరథ పర్వతం ఉండవచ్చు,'' అన్నాడు.

అది తనకు నచ్చినదీ, వీలయినదీ కావడంతో అందుకు భీముడు సరేనన్నాడు. మరునాడే ఇద్దరూ కలిసి పర్వతశ్రేణి కేసి బయలుదేరారు. ఆ దారి దుర్గమమూ, ప్రమాదకరమూ అయినది. ఎగుడు దిగుడు దారి. క్రూర మృగాల బెడద. విషసర్పాల బెడద. ఆహారసంపాదనకు కష్టపడే వారు. ఇలా ఆరు వారాలు కష్టపడి యాత్ర ముగించి తిరుగు ప్రయాణమయ్యారు. విచిత్రపుర గ్రామస్థులు వారికి ఘనసన్మానం చేశారు. దశరథ పర్వతం జాడ తెలియకపోయినా, తను బాగానే కష్టపడ్డానన్న తృప్తితో భీముడు శ్రీనగరానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

ఇకతూర్పు దిశగా వెళ్ళిన సోముడు మకరావళీ నదీ తీరానవున్న జలపురం చేరుకుని జలవిన్యాసాలతో గ్రామస్థుల్ని రంజింప జేశాడు. సంతోషించిన గ్రామస్థులతణ్ణి అక్కడే స్థిర పడమంటే ప్రస్తుత పరిస్థితిని చెప్పి తిరస్కరించాడు. అప్పుడతడి కథవిన్న మకరుడనే వాడు, ''ఈ నదిలోరెండు వారాలు ప్రయాణం చేస్తే మొసళ్ళ ద్వీపం చేరుకోవచ్చు. ఆ ద్వీపంలో దశరథ పర్వతం ఉండవచ్చు. కాని నది మధ్యలో మొసళ్ళెక్కువ. వాటి భయంతో ఇంతవరకు ఎవ్వరూ ఆ ద్వీపం చేరే సాహసం చేయలేదు. నేనొక నావికుణ్ణి. ఆ ద్వీపం విశేషాలు తెలుసుకోవడానికి నీవంటి జలనిపుణుడి తోడుకోసం చూస్తున్నాను. నువ్వు సరేనంటే బయలుదేరుదాం,'' అన్నాడు.

సోముడు సమ్మతించడంతో, వాళ్ళిద్దరూ మకరద్వీపం కేసి పడవలో ప్రయాణమయ్యారు. రెండు రోజుల ప్రయాణం తరవాత నదిలో మొసళ్ళ బెడద మొదలయ్యింది. సోముడు జలచరాలను మించిన జలవిన్యాసాలు చేసి మొసళ్ళను బెదరగొట్టి తరిమాడు. అలా రెండు వారాలు ప్రయాణం చేశాక వాళ్ళు మొసళ్ళద్వీపం చేరుకున్నారు.

వెంటనే అక్కడున్న కొందరు వాళ్ళను చుట్టుముట్టి, తమరాజు మొసలన్న వద్దకు

తీసుకువెళ్ళారు. మొసలన్న వారికథ విని, ''మా దేవత మొసలమ్మ. మొసళ్ళ కొలను మధ్యలో ఆమె విగ్రహం ఉన్నది. ఆమె తనకు నరబలి కావాలనిపించినప్పుడు పరదేశీయుల్ని ప్రేరేపించి ఇక్కడికి రప్పించుకుంటుంది. మీరు అలా వచ్చినవారే. మిమ్మల్ని మొసళ్ళ కొలనులోవేస్తాం. మా దేవతమొసలి రూపంలో వచ్చి మిమ్మల్ని ఆహారంగా స్వీకరిస్తుంది,'' అన్నాడు.

సోముడా మాటలు విని, ''నాది ఒక్కటే విన్నపం. తమరు నన్ను ముందు మొసళ్ళ కొలనులో వేయించండి. దేవత నన్ను కరుణిస్తే, కొలను మధ్యలో వున్న విగ్రహానికి సాష్టాంగ పడి వస్తాను. ఒకవేళ నేను మొసలమ్మకు ఆహారమైతే, నా మిత్రుణ్ణి కూడా కొలనులో వేయించండి,'' అన్నాడు.

ఆ మాటకు మొసలన్న మనసులో నవ్వుకుని, దగ్గరుండి సోముణ్ణిమొసళ్ళ కొలనులో వేయించాడు. ఆ వెంటనే ఒక పెద్ద మొసలి పెద్దగా నోరు తెరిచి అతడి మీదికొచ్చింది. సోముడు పలురకాల జలవిన్యాసాలు చేసి ఆ మొసలిని తరిమేసి కొలను మధ్యకు చేరి అక్కడున్న మొసలమ్మ విగ్రహానికి సాష్టాంగ పడి తిరిగి వచ్చాడు. ఆ దృశ్యం చూసిన మొసలన్న, ''మీకు మా దేవత దీవెనలున్నవి. మీకు అతిథిమర్యాదలు చేసి, పంపడం నా విధి. మీకు ఇష్టమైనన్ని రోజులుండి దశరథ పర్వతం గురించి వెతకండి,'' అన్నాడు.

రెండు వారాలు అన్వేషించాక ఆ దీవిలో దశరథ పర్వతం లేదని తేలింది. బాగానే కష్ట



పడ్డానన్న తృప్తితో సోముడు శ్రీనగరానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

రెండు మాసాల గడువు పూర్తయ్యేసరికి రాముడు, భీముడు, సోముడు శ్రీనగరంలో బసవయ్య ఇంటికి వచ్చారు. అప్పుడక్కడ జనవంద్యుడు కూడా ఉన్నాడు. ఆయన వారి అనుభవాలు విని, ''నేను చెప్పినట్టే, ఫలాన్వేషణ కారణంగా మీకు ఉపాధి కల్పించే ప్రాంతాలు దొరికాయి. మీలో భీముడు విచిత్రపురం, సోముడు జలపురం వెళ్ళి హాయిగా జీవించండి. మీ అందరిలోకీ చాలా కష్టమైన పని చేసినప్పటికీ వేరెక్కడా ఉపాధి లభించని రాముణ్ణి బసవయ్య దత్తత చేసుకుంటాడు,'' అన్నాడు.

ఇది వింటూనే భీముడు, సోముడు, కలవరపడి ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందారు.

తరవాత తేరుకుని జనవంద్యుడికి శిరసువంచి నమస్కరించి సెలవు తీసుకున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తమను బసవయ్య దత్తత చేసుకోవాలన్న కోరిక కారణంగానే భీముడు, సోముడు దశరథ పర్వతం కోసం ఎంతో కష్టపడ్డారు. ఎక్కువ కష్ట పడ్డ వాడినే బసవయ్య దత్తత చేసుకోగలడని కూడా జనవంద్యుడు చెప్పాడు. సంతాన ఫలాన్వేషణలో ప్రాణాలను సైతం లెక్క చేయకుండా కష్టపడ్డది వాళ్ళు ఇద్దరు. జనవంద్యుడు ఆ ఇద్దరిలో ఒకరిని ఎంపికచేయడానికి బదులు, తెలివితక్కువగా వంచనుడి వలలో పడి కొన్నాళ్ళు బండచాకిరీ చేసి తిరిగివచ్చిన రాముణ్ణి ఎక్కువ కష్టపడ్డాడని చెప్పడంలోని అంతర్యం ఏమిటి? రాముడి పట్ల ఆయన పక్షపాత వైఖరికి ఇది నిదర్శనంకాక మరేమిటి? నా సందేహాలకు సమాధానం తెలిసీ చెప్పక పోయావో నీ తల పగలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాముడు వంచనుడి వలలో పడ్డది సంతాన ఫలాన్వేషణ కోసం. అందుకని అతడు తనకు ఏమాత్రం ఇష్టం లేని, అలవాటు లేని కాయకష్టానికి సిద్ధపడ్డాడు. తక్కిన ఇద్దరూ ఫలాన్వేషణ విషయం అనుమానమైనా కష్టమైన పనులు చేయడానికి ప్రాముఖ్యతనిచ్చారు. వాళ్ళు చేసినవి కష్టమైన పనులే. కాని, వారికవి ఇష్టమైనవి; పేరు తెచ్చేవి; వాళ్ళ సామర్థ్యాన్ని నిరూపించేవి. ఇష్టముంటే ఎంత కష్టమైన పనైనా సులభమే. ఇష్టం లేకుంటే ఎంత సులభమైన పనీ కష్టమే. ఆ విధంగా కష్టమైన పని చేసినవాడు రాముడు. అందుకే జనవంద్యుడు అతన్ని ఎంపిక చేశాడు. ఇందులో ఎలాంటి పక్షపాతమూ లేదు. పైగా ఇద్దరి శ్రమా వృథా కాలేదు. ఉపాధికి దారిచూపాయి. మొదట ఆశ్చర్యపోయినప్పటికీ, తరవాత దీనిని గ్రహించడం వల్లే వారు తపస్వికి కృతజ్ఞతతో శిరసు వంచి నమస్కరించారు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (24)

# గొప్ప వేటగాడి దొడ్డ గుణం

గొప్ప వేటగాడూ, ఉత్తర ప్రదేశ్ కుమావ్‌నో ప్రాంత ప్రజల ఆప్తమిత్రుడూ అయిన జిమ్ కార్బెట్ గురించి మీరు వినే ఉంటారు. ఆ ప్రాంతంలో ఆయన పేరు మీదుగా సుప్రసిద్ధ జువలాజికల్ పార్క్ కూడా ఉన్నది.

ఇరవైయవ శతాబ్దం తొలి సంవత్సరాలలో మనదేశంలో సంపన్నులకూ, ఆంగ్లేయులకూ పులులను వేటాడడం ప్రధాన వినోద క్రీడగా ఉండేది. కార్బెట్ ఆంగ్లేయుడూ, వేటగాడూ అయినప్పటికీ వినోదం కోసమో, గొప్పకోసమో పులులను చంపేవాడు కాదు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే: ''పులి తన సహజ నివాస స్థానంలో ఎల్లలు లేని ధైర్యంతో విశాల హృదయంగల పెద్ద మనిషి.'' పులి మనుషులను తినడం మరిగి, గ్రామస్థులకు బెడదగా, ప్రమాద కరంగా మారినప్పుడే కార్బెట్ కార్యరంగంలోకి దిగేవాడు. ఎంతో ఓర్పుతో, పట్టుదలతో మృగాన్ని వెంటాడి కాల్చి చంపేవాడు.

1930వ సం.లో కాలా ఆగర్ కొండ సానువుల చుట్టూ ఉన్న గ్రామ ప్రజలను ఒక ఆడపులి గడగడలాడించసాగింది. తమను 'కార్బెట్ సాహిబ్' (జిమ్ కార్బెట్) మాత్రమే రక్షించగలడని స్థానికులు ఆయన వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. అప్పటికే ఆ ఆడపులి అరవైనాలుగు మందిని పొట్టనపెట్టుకున్నది. ఇది ప్రభుత్వ లెక్కలు మాత్రమే. అంతకు రెండింతల మందిని చంపివుంటుందని అక్కడి ప్రజలు చెప్పుకునేవారు. దానిని కార్బెట్ ఒక సవాలుగా తీసుకుని పులిని ఎదుర్కొనడానికి సిద్ధమయ్యాడు. చాలాసార్లు పులి ఆయనకు తారసపడింది కాని కొద్దిలో తప్పించుకున్నది. అలాగే పులి నుంచి కార్బెట్ తప్పించుకున్న సందర్భాలూ లేకపోలేదు. ఆఖ రికి ఒకనాడు తీవ్రంగా వెతుకు





తూండగా తనకు అతిసమీపంలో కుడివైపున ఒక బండమీద ఆ పులి పొంచివుండడం ఉన్నట్టుండి గమనించాడు. అది దాదాపు నవ్వుతూ కన కళ్ళను కార్బెట్ మీద కేంద్రీకరించింది. ఆ మానవుడు తన నుంచి తప్పించుకోలేడని దానికి బాగా తెలుసు. పంజా విసురు దూరంలో రుచికరమైన ఆహారం!

కార్బెట్ కుడి చేతిలో లైట్ రైఫిల్ పట్టుకుని ఉన్నాడు. అయితే, ఆయన ఎడమచేతిలో రెండు నైట్‌జార్ (ఆసకప్పెరగాడు) పక్షి గుడ్లు ఉన్నాయి. రకరకాల పక్షుల గుడ్లు సేకరించడం కార్బెట్ అభిమాన విషయం. తన వద్ద లేని నైట్‌జార్ గుడ్లు కనిపించడంతో ఎంతో ఆశగా తీసుకున్నాడు.

'మ్యాన్ ఈటర్' పులి అలా ఎదురుపడితే మరే మామూలు వేటగాడైనా సరే, వెంటనే గుడ్లను పడేసి తుపాకీని పేల్చడానికి రెండు చేతులనూ ఉపయోగించేవాడు.

అయితే, తనలో ఏమాత్రం కదలిక కనిపించినా, ఆ పులి తన మీదికి మెరుపు వేగంతో ఉరకగలదని ఎంతో అనుభవజ్ఞుడైన కార్బెట్‌కు తెలుసు. తుపాకీని పొజిషన్‌కు తీసుకురావడానికి కూడా సమయం ఉండదని ఆయనకు తెలుసు.

పులి కళ్ళల్లోకి గురిగా చూస్తూ ఆయన స్థాణువులా నిలబడ్డాడు. నెమ్మదిగా మరీ నెమ్మదిగా-అందుకు ఎంత సేపు పట్టిందో ఆయనకు గుర్తులేదు-ఆయన కుడిచేత్తోనే తుపాకీని పులి మీదికి గురిపెట్టాడు. మనుషులను తిని మరిగిన పులిగనక, మిగతా పులులకు లాగా దానికి మనుషులంటే ఏమాత్రం భయం లేదు. అసలు తొందరపడలేదు.

కార్బెట్ పులిని హఠాత్తుగా కాల్చి చంపాడు. ఎన్నో ప్రమాదాలకు ఓర్చి చేసిన సుదీర్ఘమైన బృహత్ ప్రయత్నం అలా ఫలించింది. ఆ ప్రాంత

## చందమామ ఇండియా క్విజ్-9 (అక్టోబర్ 2007) సమాధానాలు

1. బి. 1969; 2. సి. ఆర్యభట; 3. బి. ఎస్. చంద్రశేఖర్;
4. బి. బాబా; 5. ఎ. తిరువనంతపురం; 6. బి. రూర్కీ.

ప్రజలు ప్రాణభయం తొలగిపోయి ఊపిరి పీల్చుకున్నారు.

కార్బెట్ ఇప్పుడు తను పులిని చంపిన పరిస్థితిని ఒకసారి మనసులో పునశ్చరణ చేసుకున్నాడు. రెండు చేతులూ స్వేచ్ఛగా ఉన్నట్టయితే, సహజంగానే పులిని కాల్చి చంపడానికి ఆయన రెండు చేతులనూ ఉపయోగించి ఉండేవాడు. అప్పుడు పులి ఆయన మీదికి ఉరికి ఉంటుంది. లేదా అతని మీదుగా దూకి వెళ్ళి ఉంటుంది. ఎలాగైనా ఫలితం మాత్రం తన మరణమే అయి ఉండేది.

ఎడమ చేయి స్వేచ్ఛగా లేనందువల్ల ఆయన మరో ఎత్తుగడను ఆలోచించి విజయాన్ని సాధించాడు. మరోలా చెప్పాలంటే, ఆయన చేతిలో గుడ్లు ఉండడమే ఆయన ప్రాణాలను కాపాడింది! ఆయన ఆ గుడ్లు మొదట కనిపించిన చోటికి తిరిగి వెళ్ళి, గూట్లో గుడ్లను భద్రంగా ఉంచాడు. కొంత సేపటికి తల్లిపక్షి వచ్చి గూట్లో వాలింది.

కార్బెట్ ధైర్యవంతుడు, సాహస ప్రియుడు, వినయశీలి, ప్రజలకు సాయపడేవాడు. అయితే, ఈ సంఘటన ఆయన వ్యక్తిత్వంలోని అతి సున్నితమైన కృతజ్ఞతాగుణాన్ని చాటుతున్నది. ఆయనకు గుడ్ల మీద కృతజ్ఞతాభావం ఏర్పడింది. ఇష్టమైన గుడ్ల నుంచి తల్లి పక్షిని దూరం చేయకూడదని నిర్ణయించాడు. -(ఎం.డి)

## మన దేశం క్విజ్

*దాదాపు ప్రపంచవ్యాప్తంగా జరుపుకునే పండుగ క్రిస్మస్ డిసెంబర్ నెలలో వస్తోంది. ఈ సందర్భంగా కొన్ని మతాల గురించి తెలుసుకుందాం.*

1. క్రైస్తవులు తమ మత సంస్థాపకుణ్ణి 'పవిత్ర పిత' అని అంటారు. శిక్కులు తమ మతసంస్థాపకుణ్ణి ఏమని పిలుస్తారు?
2. మహావీరుడు ఎప్పుడు ఎక్కడ జన్మించాడు?



3. జొరాస్ట్రియన్ల ప్రార్థనాస్థలం పేరేమిటి?
4. బుద్ధుడి పూర్వజన్మలను గురించి తెలియజేసే కథలు చాలా ఉన్నాయి. వాటి పేరేమిటి?
5. ముస్లిం క్యాలండర్ ఎప్పుడు ఆరంభమయింది?

(సమాధానాలు 74వ పేజీలో)






## పుదుచ్చేరి రాష్ట్ర చిహ్నాలు

పాండిచ్చేరి అన్న పేరును పుదుచ్చేరిగా ఇటీవల మార్చుకున్న ఆ చిన్న రాష్ట్రం, ఇప్పుడు తన రాష్ట్రానికంటూ కొన్ని ప్రత్యేక చిహ్నాలను ఎంపిక చేసి ప్రకటించింది. సేతునిర్మాణంలో రాముడికే సాయంచేసిందని చెప్పబడే బుల్లి సాధు ప్రాణి ఉడతను రాష్ట్ర జంతువుగా స్వీకరించారు. క్రమంగా అంతరించి పోతూన్న అందమైన జంతువు ఇది కావడం విశేషం. కోకిల రాష్ట్ర పక్షి. తమిళ జాతీయ మహాకవి సుబ్రహ్మణ్య భారతి ఇక్కడి కుయిల్‌తోప్పు (కోయిల తోట)లో కూర్చునే పలు కవితలు వెలయించాడు. రాష్ట్ర పుష్పం నాగలింగ పుష్పం; వృక్షం బిల్వం. రెండూ శివుడికి ప్రీతిపాత్రమైనవిగా పురాణాలు పేర్కొంటాయి.

## అతి వృద్ధ గజం

సాధారణ పరిస్థితులలో ఏనుగులు సగటున అరవై నుంచి డెబ్బై ఏళ్ళ వరకు జీవిస్తాయి. మధ్య ప్రదేశ్ ఛతర్‌పూర్ పన్నా పులుల అభయారణ్యంలోని 'వత్సల' అనే ఆడఏనుగు వయసు ఇప్పుడు 92 సం.లు. ప్రపంచంలోనే అతి వృద్ధ గజంగా భావించబడే ఇది కేరళలోని నిలంబూరు అడవులలో పుట్టిపెరిగింది. పెద్ద పెద్ద దుంగలను మోయడానికి అటవీశాఖ దీనిని ఉపయోగించుకున్నది. 1977లో మధ్యప్రదేశ్‌లోని హోషన్గాబాద్‌కు తీసుకు వెళ్ళబడిన వత్సల 1993లో పన్నాకు తరలించబడింది.

పన్నాలో ఇది పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నది. వారానికి మూడుసార్లు దీనికి వైద్య పరీక్షలు చేస్తారు. దీనిని గురించి గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో నమోదుచేయడానికి అధికారులు ప్రయత్నిస్తున్నారు. థాయ్‌లాండ్‌లోని 86-ఏళ్ళ ఏనుగే ఇప్పటివరకు రికార్డు చేయబడి ఉన్న అత వృద్ధ గజం.



## గుజరాత్ జానపద కథ

# తిరిగివచ్చిన బంతి

జొాదవ్‌సింగ్ మహారాజుకు ఇద్దరు రాణులు. చిన్నరాణి అంటే రాజుకు అమిత ప్రేమ. కొన్నాళ్ళకు పెద్దరాణి గర్భవతి అయింది. దాంతో చిన్నరాణి చెప్పరాని అసూయకు లోనయింది. పెద్దరాణికి ఎలాగైనా సంతానం లేకుండా చేయాలని ఒక పరిచారికకు డబ్బు ఆశచూపి, కుట్రపన్నింది. ఆ పరిచారిక తల్లి కాబోయే పెద్దరాణి అభిమానాన్ని, నమ్మకాన్ని క్రమ క్రమంగా ప్రయత్నించి సంపాదించింది.

నవమాసాలు నిండి, ప్రసవం సమీపిస్తున్న సమయంలో-తల్లి కళ్ళకు గంతలు కట్టుకోవడం ఆచారమనీ, అలా చేయడం సంతానానికి మేలు చేస్తుందనీ చెప్పి, ఆ పరిచారిక పెద్ద రాణిని నమ్మేలా చేసింది. కొన్ని రోజులలో రాణి కవలలను ప్రసవించింది. వాటిలో ఒకటి ఆడ; మరొకటి మగ శిశువులు. వెంటనే పరిచారిక ఆ శిశువులను దొంగిలించి మరోచోటికి చేర్చింది. తల్లి పొత్తిళ్ళలో ఒక కొయ్యబొమ్మనూ, గడ్డి బొమ్మనూ పెట్టి రాణి వాటినే ప్రసవించినట్టు చెప్పి నమ్మించింది. రాణి దుఃఖానికి అవధుల్లేకుండా పోయాయి. అయినా పెద్దరాణిపట్ల ఏమాత్రం ప్రేమాభిమానాలు లేని రాజు దానిని అంతగా పట్టించుకోలేదు.

చిన్నరాణి పట్టరాని ఆనందంతో పరిచారికకు ముత్యాలహారాన్ని బహూకరించింది. శిశువుల్ని ప్రాణాలతో ఉంచవద్దని చెప్పి, మరిన్ని కానుకలు ఇచ్చింది. అయితే, అమాయకంగా కనిపించిన ఆ పసికందులను చంపడానికి పరిచారికకు చేతులు రాలేదు. పిల్లల్ని ఒక బుట్టలో పెట్టి పట్టువస్త్రాన్ని కప్పి, దాపుల ప్రవహించే నదిలో వదిలిపెట్టింది.

అరణ్య ప్రాంతంలో ఆ నదిలో స్నానం చేస్తూన్న ఒక మునికి నీళ్ళపై బుట్ట తేలుతూ రావడం కనిపించింది. ఆయన బుట్టను అందుకుని పైనున్న పట్టు వస్త్రాన్ని తొలగించి చూశాడు. అందమైన శిశువులను చూసి అమితానందం చెందాడు.





ఆయన ఆ పిల్లలను తన కుటీరానికి తీసుకువెళ్ళి భార్యకు చూపాడు. పిల్లలు లేని ఆమె ఒక్కసారిగా ఇద్దరు పిల్లల్ని చూడగానే హద్దులు లేని ఆనందం పొందింది. ఆమె ఆ అందమైన శిశువులను తన వెచ్చని చేతుల్లోకి సుతారంగా తీసుకుంటూ, "వీరు మనకు దేవుడు ప్రసాదించిన అద్భుతమైన కానుకలు!" అన్నది.

ఆ మునిదంపతులు పిల్లలను తన సొంత సంతానంగా భావించి అల్లారు ముద్దుగా పెంచసాగారు. ఎవరైనా వచ్చి వీరు మా పిల్లలు అంటే ఏం చేయడం అనే అనుమానం మునికి అప్పుడప్పుడు వచ్చేది. అప్పుడు భార్య, "ఎందుకలా భయపడతారు? వీరు నదిలో కొట్టుకువచ్చారు. అంటే కన్నవాళ్ళు వద్దని వదిలిపెట్టిన వారే కదా! అలాంటి వారు మళ్ళీ ఎందుకు వెతుక్కుంటూ వస్తారు? వీళ్ళు ఎప్పటికీ మన పిల్లలే," అంటూ భర్తకు ధైర్యం చెప్పేది.

పిల్లలకు మధు, శైలజ అని నామకరణం చేసి; వచ్చీ రాని మాటలతో వాళ్ళు తమను 'అమ్మా!' 'నాన్నా!' అని ముద్దు ముద్దుగా పిలుస్తూంటే ఎంతగానో సంతోషించేవారు మునిదంపతులు.

అలా పన్నెండేళ్ళు గడిచిపోయాయి. పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పసాగారు.

ఒకనాటి రాత్రి మామూలుగానే పడుకున్న ముని తెల్లవారినా పడక నుంచి లేవలేక పోయాడు. ఆయన భార్యాపిల్లలను దగ్గరికి పిలిచి, "నాకు ఇహలోక యాత్ర చాలించే తుది ఘడియలు సమీపించాయి. అంతిమ శ్వాస విడిచేలోగా నేను మీకేం ఇవ్వగలను?" అన్నాడు గంభీరంగా.

మధు, శైలజ ముని పడకను సమీపించి ఆయన చేతులను తమ చేతుల్లోకి తీసుకుని, "నాన్నా, మీరు మమ్మల్నెంతో ప్రేమాదరాలతో, ఆప్యాయంగా చూసుకున్నారు. అంతకన్నా మాకు కావలసినదేమున్నది?" అన్నారు సజల నయనాలతో.

ముని మౌనంగా తల పంకించి భార్యను తన కొయ్య పెట్టెలో భద్ర పరచిన రజాయ్ (బొంత)నీ, బంతినీ తీసుకురమ్మని చెప్పాడు. ఆమె తెచ్చాక వాటిని మధుచేతికిచ్చి, "వాటికి కొన్ని ప్రత్యేక శక్తులు ఉన్నాయి. ఆ బొంతను మీరు ఒకసారి ఊపినట్టయితే వెండి నాణాలు రాలుతాయి. రెండవసారి ఆడిస్తే బంగారు నాణాలు రాలుతాయి. మీరు ఈ బంతిని విసిరినట్టయితే, మీ శత్రువు ఎక్కడవున్నా వారికి తగిలి గాయపరచి, మీ వద్దకు తిరిగి వస్తుంది. వాటిని తెలివిగా ఉపయోగించుకోండి.

అయితే, ఒక విషయం ఎన్నటికీ మరిచిపో కూడదు,'' అని ఆగాడు.

''ఏమిటి నాన్నా?'' అని అడిగారు అన్నా చెల్లెళ్ళు ఒక్కసారిగా.

ముని లేచి తన పడక మీద కూర్చుంటూ, ''మన కుటీరానికి ఉత్తరంగా ప్రవహిస్తున్న నది మీకు తెలుసుకదా. అది పడమర నుంచి తూర్పు దిశగా ప్రవహిస్తోంది. మీరు ఇక్కడి నుంచి వెళ్ళిపోవలసి వస్తే, ఎన్నటికీ పడమటి దిక్కు కేసి మాత్రం వెళ్ళకండి,'' అన్నాడు.

పిల్లలు, ''అలాగే నాన్నా!'' అని చెబుతూం డగా ముని మందహాసంతో కన్నుమూశాడు.

భర్తపోయినప్పటి నుంచే తీవ్ర అస్వస్థతకు లోనైన మునిపత్ని ఒకనాడు పిల్లల్ని చేరబిలిచి, వాళ్ళు పసిబిడ్డలుగా తన భర్తకు నదిలో తేలుతూ వస్తూ దొరికిన విషయం చెప్పి, అందుకే అక్కడ ప్రమాదం శంకించి వాళ్ళను పడమర దిశగా వెళ్ళవద్దని ఆయన హెచ్చరించా డని గుర్తుచేసింది. ఆ తరవాత గాఢంగా ఊపిరి పీలుస్తూ, ''మీకేం కావాలో కోరుకోండి, ఇస్తాను,'' అన్నది.

''మమ్మల్ని ఎంతో ఆప్యాయంతో పెంచారు. మీ అనురాగమే మాకు చాలు. అంతకు మించి ఏదీ వద్దు,'' అన్నారు పిల్లలు.

అయినా మునిపత్ని ఒక పాత్రను శైలజ చేతికిచ్చి, ''నువ్వు కోరిన ఆహారం ఈ పాత్ర ఇస్తుంది తల్లీ. నీ జీవితంలో ఆకలి బాధ అంటూ ఎన్నటికీ ఉండదు,'' అని ఆశీర్వదిం చింది.

ఆ తరవాత ఆమె ఒక జత కొయ్యపాదుక లను తీసి మధుకు ఇచ్చి, ''నాన్నా, నువ్వు వీటిని తొడుక్కుని, ఎక్కడికి వెళ్ళాలనుకుంటే, మరుక్షణమే అక్కడికి చేరుకోగలవు. అలా వెళ్ళేప్పుడు నువ్వు నీ సోదరిని కూడా ఎలాంటి బరువు లేకుండా తీసుకువెళ్ళవచ్చు,'' అని చెప్పింది. కొన్ని క్షణాల్లోనే ఆమె అంతిమశ్వాస విడిచింది.

మధు తండ్రికి చేసినట్టే తల్లికి కూడా అంత్య క్రియలు భక్తిశ్రద్ధలతో నిర్వహించాడు.

ఆ తరవాత కొన్ని రోజులు ఆలోచిస్తూ గడి పిన మధు ఒకనాడు చెల్లెల్ని పిలిచి, ''మనం ఈ మునివాటికలో ఎన్నాళ్ళని ఉంటాం? ధైర్యం చేసి పశ్చిమ దిశగా వెళితే, మన అసలు తల్లి తండ్రులు కనిపించినా కనిపించవచ్చుకదా!'' అన్నాడు.

''నిజమే మనం ఇక్కడే ఉండి సాధించే దేమీ లేదు కదా? ధైర్యంతో పశ్చిమ దిశగా వెళదాం,'' అన్నది శైలజ.





మధు బొంతను అటూ ఇటూ రెండుసార్లు ఊపాడు. అందులో నుంచి వెండి, బంగారు నాణాలు రాలాయి. ఆ నాణాలనూ, బంతినీ మునిపత్ని ఇచ్చిన పాత్రలో వేసి భద్రపరుచుకున్నారు. మధు కొయ్యపాదుకలను తొడుక్కున్నాడు. అవి ఎగరడానికి సిద్ధంగా ఉన్నాయి. అతడు చెల్లెల్ని పట్టుకుని, పశ్చిమ దిశగా వెళ్ళాలి అనగానే, చెప్పులు అన్నాచెల్లెళ్ళతో పైకి లేచి ఆకాశంలో అటుకేసి ఎగరసాగాయి. వాళ్ళొక నగరాన్ని చేరగానే మధు కిందికి దిగాలనుకుని పాదుకలను ఒకటిగా చేర్చి బొటనవేళ్ళతో మెల్లగా నొక్కాడు. వాళ్ళిద్దరూ భూమి మీద ఒక విశాలమైన ఇంటి ముందు దిగారు.

ఆ ఇల్లు నిర్మానుష్యంగా కనిపించడంతో, ప్రస్తుతానికి దాన్నే తమ నివాసంగా చేసుకోవాలనుకున్నారు. మరునాడు శైలజ పాత్ర నుంచి కావలసిన ఆహారం తెప్పించింది. ఇద్దరూ తృప్తిగా భోజనం చేశారు. మధు బంతి తీసుకుని ఆడుకోసాగాడు. ఉన్నట్టుండి అతడు, "నన్నూ, మా చెల్లెనూ మా అమ్మ నుంచి వేరు చేసిన వారు ఈ ప్రాంతంలో ఉంటే ఈ బంతి వారికి పోయి తగలాలి," అంటూ బంతిని విసిరాడు.

బంతి వెళ్ళి కొంత సేపటికి అతని వద్దకు తిరిగి వచ్చింది. అది ఎవరికి పోయి తగిలి ఉంటుందా అని మధు ఆలోచించసాగాడు. మరునాడు కూడా అలాగే చేశాడు. అప్పుడు కూడా అది వెళ్ళి కొంతసేపయ్యాక అతని చేతిలోకి తిరిగి వచ్చింది.

చిన్నరాణి పరిచారికలతో రాజోద్యానంలో తిరుగుతూండగా హఠాత్తుగా బంతి వచ్చి ఆమె నుదుటికి ఠఫీమని తగిలి తిరిగి వెళ్ళడం చూసి, ఆమెతో సహా పరిచారికలు దిగ్భ్రాంతి చెందారు. దరిదాపుల్లో మనుషుల జాడ కనిపించలేదు. బంతి తగిలిన చోటు ఉబ్బెత్తుగా వాచిపోయి నొప్పి పెట్టసాగింది.

పరిచారికలు వెళ్ళి రాజుకు విషయం చెప్పారు. అక్కడికి హుటాహుటిగా వచ్చి భార్యను పరామర్శించిన రాజు ఆమెను కొన్ని రోజుల పాటు ఉద్యానవనంలోకి వెళ్ళవద్దని సలహా ఇచ్చాడు.

మరునాడు నుదుటిపై బొప్పికట్టిన నొప్పి కొద్దిగా తగ్గింది. ఆమె భవన మంటపంలో కూర్చుని ఉండగా బంతివచ్చి మళ్ళీ ఠఫీమని తగిలి వెళ్ళిపోవడం చూసి ఆమె దిగ్భ్రాంతి చెందింది. ఇప్పుడు నుదుటి రెండోవైపున దెబ్బ తగిలింది. నొప్పి మరీ ఎక్కువయింది.

విషయం తెలియగానే రాజు మళ్ళీ హడావుడిగా వచ్చాడు. భార్య పడుతున్న బాధను

చూసి భరించలేక ఆస్థాన వైద్యుణ్ణి పిలిపించి వైద్యం చేయించాడు. సేనాధిపతిని పిలిచి, జరిగిన విషయం చెప్పి, చుట్టుపక్కల బంతి ఆట ఆడుతూన్న వారందరినీ పట్టి దోషిని శిక్షించమని ఆజ్ఞాపించాడు. సైనికులు ఆ పరిసరాలలో బంతి ఆట ఆడుతూన్న వారికోసం వెదకసాగారు.

భవన పరిసరాలలో బంతి అన్నది కనిపించలేదు. నగరం పొలిమేరలో ఒక ఇంటి ముందు మధు బంతి ఆట ఆడుతూ కనిపించాడు. భటులు అతన్ని సమీపించి, ''నిన్న నువ్వు బంతిని రాజోద్యానం కేసి విసిరావా?'' అని అడిగాడు.

''నాకు రాజోద్యానం ఎక్కడున్నదో కూడా తెలియదు. నేను అందులోకి బంతిని ఎలా విసరగలను?'' అన్నాడు మధు.

''సరే, ఇక్కడి నుంచి మరెక్కడికీ వెళ్ళవద్దు. రాజభవనం కేసిగాని, రాజభవనం దరిదాపులకు గాని వెళ్ళవద్దు,'' అని హెచ్చరించి వెళ్ళారు భటులు.

వాళ్ళ మాటలు విని ఆలోచనలోపడ్డ మధు ఇంట్లోకి వెళ్ళి, ''ఈ బంతి రాజభవనంలోని ఎవరికో తగులుతున్నది. అది ఎవరై ఉంటారో తెలియడం లేదు,'' అన్నాడు చెల్లెలితో.

''కొన్ని రోజులు ఇక్కడే వేచి ఉండి ఏం జరుగుతుందో చూద్దాం,'' అన్నది శైలజ.

మరునాడు, గుర్రం డెక్కల చప్పుడు వినిపించడంతో అన్నాచెల్లెళ్ళు ఇంటి నుంచి వెలుపలికి వచ్చి చూశారు. వాళ్ళను చూడగానే గుర్రం మీది భటుడు, ''ప్రభూ! ఈ పసివాడే నిన్న బంతి ఆట ఆడుతూ కనిపించాడు. మరెక్కడా బంతి ఆట ఆడేవాళ్ళు కనిపించలేదు,'' అన్నాడు.

రాజు గుర్రం పైనుంచి కిందికి దిగి పిల్లల కేసి నడిచాడు. వాళ్ళను చూడగానే నివ్వెరపోయాడు. ఆ పసివాడిలో తన పోలికలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. అమ్మాయిలో తన పెద్దరాణి పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రాజుకు కొంతసేపు నోట మాట రాలేదు. ఆ తరవాత తేరుకుని, ''మీరిద్దరు మాత్రమే ఇక్కడ ఉంటున్నారా?'' అని అడిగాడు.

''అవును, ప్రభూ! అరణ్య ప్రాంతంలోని మా తల్లితండ్రులు మరణించడంతో మేము ఇక్కడికి వచ్చేశాము,'' అన్నాడు మధు.

''మేము శిశువులుగా ఉన్నప్పుడు ఒక బుట్టలో నదిలో తేలుతూ వచ్చి ముని దంపతు



లకు దొరికామట. వాళ్ళే మమ్మల్ని పెంచారు. వాళ్ళు ఇప్పుడు మరణించారు. మా అసలు తల్లితండ్రులు ఎవరో మాకు తెలియదు,'' అన్నది శైలజ.

రాజు తీవ్రమైన భావోద్వేగానికి లోనయ్యాడు. ''వారెవరో నాకు తెలుసు. నా భవనానికి వచ్చారంటే చూపెడతాను. నేను వెళ్ళి రథం పంపిస్తాను. భటులు నీవెంట ఉండగలరు,'' అని చెప్పి రాజు గుర్రంఎక్కి వెళ్ళిపోయాడు.

రథం వచ్చేలోగా అన్నాచెల్లెళ్ళు బయలుదేరడానికి సిద్ధమయ్యారు. ''పాత్రనూ, నాణాలనూ వదల వద్దు సుమా. ఎప్పుడు ఏమవుతుందో మనకేం తెలుసు,'' అన్నాడు మధు చెల్లెలితో తను బొంతనూ, ఎగిరే పాదుకలనూ తీసి భద్రపరుచుకుంటూ.

అన్నాచెల్లెళ్ళు రథమెక్కారు. రథం కదిలింది. వారి వెనక భటులు గుర్రాలపై బయలుదేరారు. రాజభవనం ముంగిట మధు, శైలజ రథంలో నుంచి దిగగానే రాజు ఎదురు వెళ్ళి వాళ్ళను ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. ''అదిగో మీ తల్లి,'' అంటూ పెద్దరాణిని చూపాడు.

పెద్దరాణి సజల నయనాలతో పిల్లలను కౌగిలించుకున్నది. ఆమె నోటి నుంచి ఒక్క మాట కూడా రాలేదు. మనసంతా ఉద్వేగంతో నిండిపోయింది.

తల్లి వెనకే నిలబడివున్న స్త్రీ నుదుటి మీద రెండు బొడిపెలు ఉన్న విషయం అన్నాచెల్లెళ్ళు గమనించి ఒకరినొకరు చూసుకున్నారు. తమ 'శత్రువు' ఎవరో గ్రహించారు. అయినా, ఆ రహస్యాన్ని తమలోనే దాచుకోవాలని ఇద్దరూ చూపులతోనే నిర్ణయించుకున్నారు.

రాజదంపతులు కూడా తమ మనసుల్లోని అనుమానాలను బయట పెట్టకూడదనే భావించారు. జరిగిందేదో జరిగిపోయింది. ఇకపై హెచ్చరికతో ఉంటే చాలనుకున్నారు. కవలలను కొత్తగా కనుగొనబడ్డ యువరాజు, యువరాణులుగా చూసుకున్నారు.






## సెహ్-తార్ నుంచి సితార్



వీణాపాణి సరస్వతి, నారదముని చేతిలో తంబూరా, పరమశివుడి చేతిలో ఢమరుకం, శ్రీకృష్ణుడి చేతిలో వేణువు ఇలా మన దేవతలు సైతం సంగీత ప్రియులన్న విషయం జగద్విదితం. ఆధునిక సంగీత వాయిద్యాలలో మనదేశానికి సంబంధించినవే చాలావరకు అయినప్పటికీ కొన్ని విదేశాల నుంచి కూడా వచ్చాయి. సితార్‌ను పోలిన రకరకాల వాయిద్యాలు మనదేశంలో వివిధ ప్రాంతాలలో ప్రాచీన కాలం నుంచే ఉండేవని చెబుతారు. పన్నెండవ శతాబ్దంలో మనదేశంలో జీవించిన సుప్రసిద్ధ పర్షియన్ కవి అమీర్ ఖుస్రూ 'సెహ్-తార్' అనే సంగీత వాయిద్యాన్ని రూపొందించాడనీ, అదే ఆ తరవాత 'సితార్'గా పేరొందిందనీ చెబుతారు. అందులో ఏడు తంత్రులు ఉంటాయి.

## తొలి తిరుగుబాటు

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తొలి సిపాయిల తిరుగుబాటు 1857 మార్చ్ 29వ తేదీ ప్రారంభమయింది. ఆ రోజు మంగల్‌పాండే తన బ్రిటిష్ అధికారిని కాల్చిచంపాడు. ఆయనకు మరణ దండన విధించబడింది. దేశస్వాతంత్ర్యం కోసం ప్రాణత్యాగం చేశాడు. అయితే, అంతకు ముందే విశాఖపట్నంలో (1780) భారతీయ సిపాయిలు కొందరు బ్రిటిష్ సైనికులను, పౌరులను కాల్చిచంపారు. మద్రాసు (చెన్నయ్)కు వెళ్ళే ఓడలోకి ఎక్కమంటే వాళ్ళు ఎదురు తిరిగారు. సర్కారు జిల్లాలకే గాని, కర్ణాటక ప్రాంతానికి సేవచేయడం తమ పనికాదని ఎదురుతిరిగారు.



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 3

# ఫలదానంతో ప్రాణరక్షణ!

ఢిల్లీ దర్బారులో కొలువుతీరిన ఔరంగజేబు, సింహాసనం నుంచి లేచి అసహనంగా, పట్ట రాని ఆవేశంతో అటూ ఇటూ తిరగసాగాడు. బాజీ ప్రభు, మరికొందరి అనుచరుల సాయంతో, శివాజీ పన్హాలా నుంచి తప్పించుకున్నాడు. ఆ తరవాత ఆయన మళ్ళీ మొగలులపై దాడులు ప్రారంభించాడు. దక్షిణాదిలో గోవా వరకు వశపరచుకుని, తీరంలోని శత్రు స్థావరాలను చిన్నాభిన్నం చేస్తూ అహమ్మదాబాదుకేసి సేనలను నడిపిస్తున్నాడు. ఔరంగజేబు అసహనానికి, అశాంతికి, పట్టరాని ఆవేశానికి అదే కారణం.

శివాజీ దుందుడుకు చర్యలను అరికట్టి, అతన్ని ఎలాగైనా అణచివేయాలి అని ఔరంగజేబు పదేపదే పలవరించసాగాడు.

మొగల్ చక్రవర్తికి ఆ సమయంలో శివాజీ బాల్యంలో జరిగిన ఒక సంఘటన గుర్తురావడంతో మరింత అసహనానికి లోనయ్యాడు.



పన్నెండేళ్ళ వయసులో శివాజీ తండ్రి షాజీ వెంట బిజాపూర్ సుల్తాను వద్దకు వెళ్ళాడు. సభలో ప్రవేశించగానే షాజీ వంగి మూడు సార్లు నేలనుతాకి సుల్తానుకు నమస్కరించాడు. ఆ తరవాత శివాజీని కూడా అలాగే సుల్తానుకు నమస్కరించమన్నాడు. అయితే, శివాజీ నాలు గడుగులు వెనక్కు వేసి తలెత్తి చూశాడు. పరాయి పాలకుడికి తలవంచనన్న ధీమా అతడి చూపుల్లో కనిపించింది. సుల్తాను సభలో అంతకు ముందెవరూ అలా ప్రవర్తించింది లేదు. సుల్తానుతో సహా సభికులందరూ అమితాశ్చర్యంతో చూస్తూండగా బాల శివాజీ సభనుంచి వెలుపలికి నడిచాడు.

కొడుకు ప్రవర్తనకు షాజీ లోలోపల ఎంతగానో మురిసిపోయాడు.

వ్యాధిగ్రస్తుడైన తండ్రిని గృహనిర్బంధంలో ఉంచి ఔరంగజేబు 1658లో సింహాసనాన్ని అధిష్ఠించాడు. సాధుస్వభావుడూ, పండితుడూ అయిన సోదరుడు దారాసుఖోతో సహా ముగ్గురు అన్నదమ్ములను హతమార్చాడు. ఎదురు తిరగగలరన్న అనుమానంతో కన్న బిడ్డలనే కారాగారంలో బంధించిన పరమ క్రూరుడు ఔరంగజేబు.

కొండలతో నిండిన దక్కను ప్రాంతంలో శివాజీ అనుసరించే గెరిల్లా యుద్ధ విధానం

ఔరంగజేబును కలవరపెట్టింది. మరాఠా నాయకుణ్ణి అణచడానికి 1660లో విశ్వాస పాత్రుడైన తన మేనమామ షయిస్తఖాన్‌ను సేనలతో పంపాడు. అయితే, షయిస్తఖాన్‌కు అది అంత సులభంగా తోచలేదు. తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కోలేక వందలాది మంది సైనికులు చనిపోయారు. ఎలాగో పూనాను ఆక్రమించి తన స్థావరాన్ని ఏర్పాటు చేసుకున్నాడు షయిస్తఖాన్. మరో మూడేళ్ళలో తనవశంలో ఉన్న అనేక ప్రాంతాలను శివాజీ కోల్పోవలసి వచ్చింది. అయినా ఎదురు దాడికి సరైన సమయం కోసం ఎదురుచూడ సాగాడు.

పూనా నగర వీధిలో ఒకనాటి రాత్రి వెళుతూన్న పెళ్ళి ఊరేగింపులో శివాజీ తన అనుచరులతో కలిసి వెళ్ళాడు. పెళ్ళి ఊరేగింపు షయిస్తఖాన్ బసచేసివున్న భవనం గుండా వెళుతూండగా, శివాజీ రహస్యంగా భవనంలో ప్రవేశించాడు. సాహసవీరులైన అనుచరులతో వీర శివాజీ హఠాత్తుగా తన శయనమందిరంలో ప్రత్యక్షం కావడంతో షయిస్తఖాన్ ఇది కలా, నిజమా అని దిగ్భ్రాంతి చెందాడు. భయంతో ఏం చేయడానికీ తోచక గడగడ వణికిపోయాడు. ఉన్నట్టుండి కిటికీ గుండా వెలుపలికి దూకి ప్రాణాలతో పారిపోయాడుగాని, శివాజీ కత్తి వేటుకు బొటన వేలును కోల్పోయాడు. ఆ మెరుపు దాడిలో షయిస్తఖాన్ కొడుకు, మరి కొందరు సైనికులు మరణించారు. మొగలు సేనలు మేలుకుని అసలు ఏం జరిగిందో తెలుసుకునే లోగా శివాజీ అక్కడి నుంచి సురక్షితమైన తన స్థావరానికి చేరుకున్నాడు.

ఇరవై వేలమంది సైనికులతో అభేద్యమైన రక్షణా వలయంలో ఉన్న మొగలు సేనాధిపతి మీదికి వ్యూహాత్మకంగా దాడి చేసిన శివాజీ అద్భుతమైన శక్తియుక్తులను దేశప్రజలు ఆశ్చర్యానందాలతో కథలు కథలుగా చెప్పుకోసాగారు.

బొటన వేలిని పోగొట్టుకుని ఢిల్లీకి తిరిగి వచ్చిన షయిస్తఖాన్‌ను చూసి ఔరంగజేబు ఆగ్రహం చెందాడు. మరింత అసహనానికి లోనయ్యాడు.

1664లో శివాజీ సిరిసంపదలకు పేరుగాంచిన సూరత్‌లోని కొన్ని మొగల్ స్థావరాలను దోచుకున్నాడు. దాంతో అమితాగ్రహం చెందిన ఔరంగజేబు సాహస యోధుడూ, రాజనీతి కోవిదుడూ అయిన రాజపుత్ర వీరుడు రాజా జైసింగ్‌ను సేనలతో దక్కను నాయకుడు శివా



జీని అణచడానికి పంపాడు. అసంఖ్యాకమైన సేనలతో బయలుదేరిన రాజా జైసింగ్ పురందర్‌ను ముట్టడించి దానితో పాటు క్రమక్రమంగా మరో ఇరవై కోటలను వశపరచుకున్నాడు. అమితమైన సైనికబలంతో, వ్యూహాత్మకంగా దూసుకువస్తూన్న జైసింగ్‌ను నిలువరించడం అసాధ్యం అని గ్రహించిన శివాజీ అతడితో సంధి ఒడంబడికకు సంసిద్ధుడయ్యాడు. రాజా జైసింగ్ అభ్యర్థనమేరకు సంధి చర్చలు జరపడానికి ఔరంగజేబు సభకు వెళ్ళడానికి శివాజీ సమ్మతించాడు. ఔరంగజేబు శివాజీని దక్కను వైస్రాయిగా చేయగలడన్న ఊహాగానాలు కూడా వచ్చాయి. అయినా, పరమక్రూరుడైన ఔరంగజేబు సభకు వెళ్ళడం రాక్షసుడి కోరల్లోకి జొరబడడమేనని శివాజీ మిత్రులు భావించి వారించారు. అయినా, శివాజీకి ఎలాంటి ఆపదారాకుండా చూసుకోవడం తన బాధ్యత అని రాజా జైసింగ్ వారికి హామీ ఇచ్చాడు.



శివాజీ తన చిన్న కొడుకు శంభూజీతో కలిసి మొగలుల సభకు వెళ్ళాడు. ఆరోజు ఔరంగజేబు జన్మదినం గనక, ఆగ్రా కోటలోని దర్బారు చాలా చక్కగా అలంకరించబడి ఉన్నది. ''రాజా, శివాజీకి స్వాగతం!'' అంటూ హేళనగా పలకరించిన ఔరంగజేబు తన భటులకు సైగ చేశాడు. భటులు ఆయన్ను సాధారణ పౌరులు కూర్చునే చోటికి తీసుకువెళ్ళి కూర్చోబెట్టారు. ఆ తరవాత ఆయన్నెవరూ పట్టించుకోలేదు. దానిని తీవ్రమైన అవమానంగా భావించిన శివాజీ, ఆగ్రహంతో లేచి ఇచ్చిన మాట నిలుపుకోలేదని నిందిస్తూ, కొడుకుతో సహా సభనుంచి వెలుపలికి నడవసాగాడు. ఆయన్ను దోషిగా ప్రకటించి, ఖైదు చేయమని ఆజ్ఞాపించాడు ఔరంగజేబు.

తండ్రీ కొడుకులు ఒక ఇంట్లో బందీలయ్యారు. అలాగే మూడు నెలలు గడిచి పోయాయి. శివాజీ తీవ్ర అస్వస్థతకు లోనైనట్టు ఒక రోజు తెలియజేయబడింది. ఇంటి నుంచి రోజూ, గంపల నిండుగా ఫలపుష్పాలూ, ఫలహారాలూ పేదలకు, సాధుసన్యాసులకు పంపడానికి అనుమతించాలనీ, వారి ప్రార్థనలతో తన ఆరోగ్యం బాగుపడగలదనీ శివాజీ కోరాడు. ఔరంగజేబు ఆయన కోరికను మన్నించాడు. రోజూ ఇద్దరు మనుషులు కావడి బద్దకు రెండు వైపులా రెండు బుట్టలను తగిలించుకుని అందులో పువ్వులు, పళ్ళు, ఫలహారాలు వెలుపలికి తీసుకువెళ్ళేవారు.

మొదట ఒకటి రెండు రోజులు భటులు బుట్టలో ఏముందో క్షుణ్ణంగా పరిశీలించి బయటికి పంపేవారు. కాని రోజులు గడిచేకొద్దీ అంత జాగ్రత్తగా చూడడం మానేశారు.

ఒకనాడు మధ్యాహ్నం శివాజీ ఆరోగ్యం ఆందోళనకరంగా ఉన్నదనీ, ఎవరూ లోపలికి రాకూడదనీ తెలియజేయబడింది. సాయంకాలం మొగలు సైనికులు కిటికీగుండా తొంగిచూశారు. శివాజీ ఒళ్ళంతా దుప్పటితో కప్పబడి పడుకుని ఉన్నాడు. కుడి చేయి మాత్రం బయటకు కనిపిస్తున్నది. సైనికులు తృప్తిగా వెనుదిరిగారు. పొద్దుగూకుతూండగా పనిమనిషి వెంట ఇంటి నుంచి వెలుపలికి వచ్చిన ఒక పెద్దమనిషి, ''ఇప్పుడే ఆయనకు నిద్ర పట్టింది. శబ్దం చేయకండి,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

అంతకు ముందే, రోజూ బుట్టలతో ఫలాలను మోసుకువెళ్ళే మనుషులు రెండు కావళ్ళతో ఇంటి నుంచి వెలుపలికివెళ్ళారు. వాటిలో ఒక బుట్టలో శివాజీ, మరొక బుట్టలో శంభూజీ ఉన్నారు. పళ్ళను తీసుకువెళ్ళడం ప్రతిరోజూ మామూలుగా జరుగుతున్నదే గనక, కాపలా భటులకు ఎలాంటి అనుమానమూ రాలేదు.

ఆ తరవాత ఇంటి నుంచి ఎలాంటి శబ్దమూ రాకపోవడంతో అనుమానం కలిగి కాపలా భటులు లోపలికివెళ్ళి చూశారు. ఒక్కరూ లేరు. తాము చూసినప్పుడు శివాజీలాగా పడకపై పడుకున్నది శివాజీ కాదనీ, ఆయన పోలికలున్న మారాఠీ యోధుడు హీరాజీ ఫర్జంద్ అనీ ఆ తరవాత తెలియవచ్చింది.

నగర పొలిమేరలు దాటాక శివాజీ, ఆయన కుమారుడూ తమ అనుచరులు సిద్ధంగా ఉంచిన గుర్రాలపై స్వస్థలం కేసి బయలుదేరారు. మార్గ మధ్యంలో శత్రువుల కంట బడకుండా తప్పించుకోవడానికి సాధువుల వేషంతో తమ నివాసాన్ని చేరుకున్నారు. శివాజీ తప్పించుకోవడానికి నిజానికి మొగలు సేనాధిపతి రాజాజైసింగ్ సాయపడ్డాడని చెబుతారు. ఆ విధంగా శివాజీ భద్రతకు ఇచ్చిన మాట నిలుపుకున్నాడన్న మాట!

అదే సమయంలో, కాపలాభటుల నాయకుడు ఔరంగజేబు వద్దకు వెళ్ళి ఏం చెప్పాలో తెలియక భయంతో వణుకుతూ, ''గదిలోనే ఉన్నాడు. ఎలా మాయమై పోయాడో ఏమో! ఆయనకేవో అద్భుత శక్తులు ఉన్నాయి,'' అని చెప్పసాగాడు. ఆ మాటలు వింటూంటే ఔరంగజేబుకు వెయ్యి తేళ్ళు ఒక్కసారిగా కుట్టినట్టయి మౌనంగా ఉండిపోయాడు. --(ఎకెడి)



# రంగులు మన సమీపంలోనే ఉన్నాయి

''మరో బోరుకొట్టే మీటింగ్,'' గొణుక్కుంటు న్నట్టు పైకి అన్నది తార.

సూరజ్, వర్షలకు ఆ మాట అంతగా రుచించ లేదు.

''ఈ డిటెక్టివ్ క్లబ్ వల్ల నిజానికి ఎలాంటి ప్రయోజనమూ లేదు. ఛేదించడానికి ఎలాంటి మర్మమూ లేనప్పుడు క్లూలకోసం, అనుమాని తుల కోసం గాలించడం వల్ల పెద్దగా ఒరిగే దేమిటి?'' అన్నది తార మళ్ళీ విసుగ్గా.

ఆ మాటలో నిజం ఉన్నట్టే వర్షకు అనిపిం చింది. అయినా, వాళ్ళకు ఎలాగైనా గొప్ప డిటె క్టివ్‌లు అనిపించుకోవాలనే ఉబలాటం ఉన్నది. డిటెక్టివ్‌లు అన్న తరవాత క్లూల కోసం, అను మానితులకోసం వెతక్క తప్పదు కదా!

''ఈ విషయంలో మనం ఏదైనా చేసి తీరాలి,'' అన్నది వర్ష పట్టుదలగా.

''ఏం చెయ్యాలో నువ్వే చెప్పుమరి,'' అని అడిగాడు సూరజ్.

''అదే సరిగ్గా తెలియడం లేదు,'' అన్నది వర్ష ఆలోచిస్తూ.

వాళ్ళు ముగ్గురూ ఒక రావిచెట్టుకింద పైకి తేలి వున్న వేళ్ళ మీద కూర్చుని మాట్లాడుకుం టున్నారు.

''కనిపించిన ప్రతి కొత్తముఖాన్నీ అనుమానిం చడం అర్థరహితం. పోయిన నెలలో నెరసిన పొడుగు గడ్డం వ్యక్తి మీద అనవసరంగా దాడి జరిపిన విషయం గుర్తున్నది కదా?'' అని అడి గింది వర్ష.



"అతడు మారువేషంలో ఉన్నాడనుకున్నాను. అందుకే అలాంటి పొరబాటు జరిగిపోయింది," అంటూ నవ్వాడు సూరజ్.

"వింతగా ఉన్న ప్రతి వ్యక్తినీ అనుమానించగలమా?" అని అడిగింది తార సాలోచనగా. దానికి ఇద్దరూ సమాధానం చెప్పలేదు. కాని, పక్కకు తలలు తిప్పి చూస్తున్నారు. తార కూడా అటుకేసి చూసింది.



వింతగా కనిపిస్తున్న ఒక స్త్రీ చెట్ల చాటు నుంచి ఇవతలికి వచ్చింది.

అంతగా జనసంచారం లేని ఢిల్లీ పొలిమేర ప్రాంతం అది. మధ్యాహ్న సమయం కావడంతో, ఒకరిద్దరు కూడా అటుకేసి రారు.

ఆ వింత స్త్రీ వెలిసిపోయిన పొడవాటి ఘాగ్రా ధరించి ఉన్నది. కాళ్ళకు చెప్పులు లేవు. చేతిలో ఒక గోనెసంచీ ఉన్నది. అర్థం కాని భాషలో ఏదో చిన్నగా పాడగానే కొన్ని పక్షులు వచ్చి ఆమె చుట్టూ చేరి ఆమె పాటతో కలిసి కలకలారావాలు చేసి వెళ్ళిపోయాయి.

ఆమె చెట్టు కింద కూర్చుని సంచీలో నుంచి ఏదో బయటకు తీసింది. పిల్లలు ఆదుర్దాగా చూడసాగారు. అదొక పుస్తకం. ఆ తరవాత కొన్ని పాత సీసాలను వెలుపలికి తీసింది. అవి రీసైకిల్ చేయబడ్డ టొమాటో సాస్ బాటిల్, జామ్ జార్, ఊరగాయ సీసా అని వర్ష గుర్తించింది. వాటినిండా రంగు ద్రవాలు ఉన్నాయి. ఆ తరవాత ఆమె సంచీ నుంచి మరొక పెద్ద ఈకను బయటకు తీసింది. "ఆమె ఏదో చిత్రంగీస్తోంది," అన్నది వర్ష.

"పక్షుల బొమ్మలు. ఆమె ఇంకేదో కూడా రాస్తున్నది," అన్నది తార.

ఆమె రంగురంగుల బట్టను తీసి నేల మీద పరచిచేస్తూన్న పనులను చూసి సూరజ్ భయపడ్డాడు. "రండి, వెళ్ళి పోదాం," అంటూ ఒక్క గెంతున ఆమెను దాటుకుని రోడ్డు కేసి పరిగెత్తసాగాడు. మిగతా ఇద్దరూ సూరజ్ వెంట పరిగెత్తారు.

అయితే, సూరజ్ అలా ఆతృతగా పరిగెత్తుతూ దారిలో ఉన్న గోనెసంచీ కాళ్ళకు తగులుకోవడంతో కింద పడ్డాడు. వాడి మీద తార, వర్ష పడ్డారు.

వాళ్ళ కాళ్ళు, చేతులకు తగిలి ఆ వింత స్త్రీ పెట్టిన సీసాలు చెల్లాచెదరై రంగులు కింద పోసుకున్నాయి. ఆకుపచ్చ, పసుపు పచ్చ, లేత ఎరుపు, నీలం రంగు ద్రవాలు గోనెసంచీ మీద ఒలికి పోయాయి. దానిని చూసిన ఆమె కోపంతో, "విలువైన నా రంగులన్నీ వృథా అయిపోయాయే!" అన్నది.



''మీ వస్తువులన్నిటినీ చెల్లాచెదరు చేశాం. సారీ, ఆంటీ,'' అంటూ వర్ష ఆ వింత స్త్రీని సమీపించింది. ''ఫరవాలేదులే,'' అంటూ ఆమె చిన్నగా నవ్వుతూ చుట్టూ చెల్లాచెదరైన ఈకనూ, రంగులనూ ఒక్కొక్కటిగా తీసి పక్కన పెట్టసాగింది.

ఆమె తాము అనుమానించినట్టు భయంకరంగా లేదు. మామూలుగా ఉన్నది. 'మేము మీ రంగు దుపట్టాలు చూడవచ్చా?'' అని అడిగింది తార.

''ధారాళంగా,'' అంటూ ఆమె రంగురంగుల ఆకర్షణీయమైన దుపట్టాలను చూపించింది.

''చాలా అందంగా ఉన్నాయి,'' అన్నారు తార, వర్ష ఒక్కసారిగా.

నవ్వుతూ తమ కేసి చూస్తున్న ఆమెను, ''మీకిలాంటి అందమైన రంగులు ఎక్కడ లభిస్తాయి?'' అని అడిగింది వర్ష.

''ఈ రంగులన్నీ కూరగాయల నుంచి తయారుచేసినవే. అవన్నీ నేను స్వయంగా తయారు చేసినవే. కావాలంటే మీరూ తయారు చేసుకోవచ్చు,'' అన్నదామె.

''అలాగా!'' అని ఆశ్చర్యపోయి, ''ఎలా తయారు చేయాలో నేర్పుతావా?'' అని అడిగింది తార.

''తప్పకుండా!'' అన్నదామె. ''నేను...'' అని ఇంకేదో ఆమె చెప్పబోతూండగా కీచుమనే కంఠస్వరం వినిపించడంతో అందరూ అటుకేసి తిరిగి చూశారు.

సూరజ్ చుట్టూ ముగ్గురు కుర్రాళ్ళు నిలబడి నవ్వుతున్నారు. కాని సూరజ్ బిత్తర చూపులు

పిల్లలు విస్తుపోయారు. ఆ వింత స్త్రీ తమతో, తమకు తెలిసిన భాషలో మాట్లాడుతున్నది!

వాళ్ళు భయపడిపోయి, మరింత ముందుకు పరిగెత్తిపోయి వెనక్కు తిరిగి చూశారు.

''ఆమె బట్టలకు రంగులు వేస్తున్నది. బహుశా బంధ్ని దుపట్టాలు అమ్ముతుందనుకుంటాను,'' అన్నది తార నవ్వుతూ.

''బంధ్నీ దుపట్టాలా? అవి రంగు రంగులుగా ఉంటాయని విన్నాను. రండి, వెళ్ళి చూద్దాం,'' అంటూ వర్ష ఆ వింత స్త్రీ కేసి నడిచింది. తార జంకుతూనే ఆమెను అనుసరించింది.

''మీరు వెళ్ళి చూసిరండి. నేను ఇక్కడే నిలబడతాను,'' అన్నాడు సూరజ్ కంపిస్తున్న కంఠస్వరంతో. ఆమె పట్ల వాడికింకా నమ్మకం కుదరలేదు.

చూస్తున్నాడు. ఇంతకు ముందు అరిచింది కూడా వాడే.

''ఆహా, కుర్రాళ్ళ ముఠా అన్నమాట!'' అని అరిచింది వర్ష. ''ముఠానా?'' అని ఆశ్చర్య పోయింది ఆ స్త్రీ.

''అవునవును. మా కాలనీలోని కొందరు కుర్రాళ్ళు హోలీ రోజుల్లో ముఠాగా చేరి, వచ్చే పోయేవాళ్ళ మీద బెలూన్లతో రంగునీళ్ళు, పొడులు చల్లుతారు. వాళ్ళను చూసి అందరూ హడలుకుంటారు. రేపు హోలీ కదా. అందుకే ఈరోజే తయారయ్యారన్న మాట!'' అని చెబుతూ కుర్రాళ్ళ కేసి పరిగెత్తింది వర్ష రొజుతూ రొప్పుతూ.

పూల చెట్ల మధ్య నిలబడ్డ కుర్రాళ్ళు కాళ్ళ కింద రకరకాల పూలను చితక తొక్కేస్తున్నారు.

''ఆగండి!'' అంటూ వారిని సమీపించిన ఆ వింత స్త్రీ, ఒక కుర్రాడి నుంచి వాటర్ బెలూన్‌ను లాక్కుని దాన్ని చూసి, ''భయంకరమైన రసాయనిక రంగులు! చర్మానికి అవి ఎంత హాని చేస్తాయో మీకు తెలుసా? చదువుకుంటున్నారు, ఆమాత్రం తెలియదా?'' అని మందలించింది.

కుర్రాళ్ళు వెనక్కు అడుగు వేశారు. కొత్త మనుషులన్నా, కొత్త ఆలోచనలన్నా జడుసుకునే మనస్తత్వం వాళ్ళది.

''అసలు రంగుల పండుగ అంటే ఏమిటో మీకు తెలుసా?'' అని అడిగింది ఆ స్త్రీ.

తెలియదన్నట్టు తలలూపారు పిల్లలు.

''వసంతానికి స్వాగతం పలికే పండుగ. ఒకసారి మన చుట్టూ ఉన్న చెట్టుచేమలు, పువ్వులు, పక్షుల రంగులు పరిశీలించి చూడండి. మన సంతోషాన్ని తెలియజేయడానికే మిత్రుల మీద రంగునీళ్ళు చల్లుతాం. అలాగని తెలియని వారి మీద, హఠాత్తుగా రంగులు చల్లడం సంబరం అనిపించుకోదు. పైగా మీరు ఉపయోగించే రసాయనిక పదార్థాలు చాలా హానికరమైనవి. హోలీ రంగులకు ఉపయోగించడానికి తగిన నిరపాయకరమైన కూరగాయల రంగుల గురించి మీరెప్పుడూ వినలేదా?'' అని గద్దించి అడిగింది ఆమె.

కుర్రాళ్ళు సమాధానం ఏమీ చెప్పకుండా మౌనంగా అక్కడి నుంచి జారుకున్నారు.

వర్ష, తార, సూరజ్ ఆ స్త్రీతో స్నేహం ఏర్పరచుకున్నారు. మరుసటి వారం నుంచి ఆమె దగ్గర మామూలుగా లభించే కూరగాయలతో నిరపాయకరమైన, వాతావరణ కాలుష్యం కలిగించని అందమైన రంగులు తయారు చేయడం నేర్చుకున్నారు.

-వి. శ్రుతీదేవి



## నాకు నచ్చిన కథ–6



సాహిత్య అకాడెమీ బహుమతీ గ్రహీత అశోకమిత్రన్ సుప్రసిద్ధ తమిళ రచయిత. ఆంగ్లంలోనూ రచనలు చేసే ఆయన కథలు, నవలలు, సాహితీ విమర్శలు అంటూ నలభైకి పైగా గ్రంథాలు రచించారు. ఆయన రచనలు వివిధ భారతీయ భాషలతో పాటు జర్మన్, ఫ్రెంచ్, ఇంగ్లీష్, స్పానిష్, రష్యన్, హంగేరియన్ భాషలలోకి అనువదించబడ్డాయి. మూడు సార్లు ఉత్తమ కథారచయితగా తమిళనాడు రాష్ట్రప్రభుత్వ అవార్డులు అందుకున్నారు. ఆయన హార్మొని అవార్డు, అగ్ని అక్షర అవార్డులను కూడా అందుకున్నారు.

# నా జ్ఞాపకాలలో మహాభారతం మహాత్మాగాంధి

నా బాల్యంలో నాకు బాగా నచ్చినరెండు కథలు బాలభారతం, మహాత్మాగాంధీ సంగ్రహజీవిత చరిత్ర. మేము ఆ రోజుల్లో సికింద్రాబాదు బోయిగూడాలో ఉండే వాళ్ళం. 1936–38 మధ్య కాలంలో నేను ఆ రెండు పుస్తకాలను చదివాను. అప్పుడు నేను బడికివెళ్ళనని మొండి కెత్తాను. నాకు ముందు పుట్టిన ఇద్దరు కొడుకు లను పోగొట్టుకోవడం వల్ల, నా తల్లితండ్రులు నాకు ఆలస్యంగా బడిలో చేరే ఆనందాన్ని కలిగించారు.

బాలభారతం ప్రత్యేకంగా పిల్లల కోసం ఉద్దేశించబడ్డది. అందులో బొమ్మలేవీ లేవు కాని, చిన్న చిన్న అధ్యాయాలూ, పెద్ద పెద్ద అక్ష రాలూ ఉండేవి. పుస్తకం చిన్నదే అయినప్పటికీ ఆ ఇతిహాసంలోని కథల సారాంశం పాఠకుల హృదయాలలో హత్తుకునేలా ఉండేవి. పాత్రలు సజీవంగా చిత్రించబడ్డాయి. వాటిలో యుధిష్ఠి రుడు అంటే ధర్మరాజు, భీముడి పాత్రలంటే నాకెంతో అభిమానం. అయినా దుర్యోధనుడు, కర్ణుడి పట్ల ఎలాంటి ద్వేషభావమూ ఉండేది కాదు.

నాకు అప్పుడు ఆరేళ్ళ వయసు ఉంటుంది. అయినప్పటికీ, అంత గొప్ప మనుషులు ఒకరి నొకరు చంపుకోవలసి వచ్చిందే అని బాధపడే వాణ్ణి. పాండురాజు ఇద్దరు భార్యలు కుంతి, మాద్రి చుక్కల్లాంటి ఐదుగురు పిల్లల్ని కన్నారు. అన్న ధృతరాష్ట్రుడి భార్య గాంధారికి అసూయ కలిగించింది. ఎంతకూ ప్రసవం కాని తన గర్భాన్ని రాతి రోకలితో బాదుకున్నది. పిండం బయట పడింది. వ్యాసుడు ఆ పిండాన్ని నూటొక్క భాగాలు చేసి నూరుగురు మగ పిల్లలు, ఒక ఆడపిల్ల రూపొందేలా చేశాడు. ఆ విధంగా కౌరవులు అసూయ నుంచే జన్మిం చిన వారయ్యారు.

కౌరవులలో పెద్దవాడైన దుర్యోధనుడు పాండవుల శక్తిసామర్థ్యాలు, మంచి గుణగణాలు

చూసి అసూయ చెందాడు. ముఖ్యంగా భీముడి అద్భుత బలాన్ని చూసి మరింత ఈర్ష్యతో దహించుకుపోయాడు. ఒకనాడు కౌరవులు భీముడికి రహస్యంగా విషమిచ్చి, కాళ్ళు చేతులు కట్టి నదిలోకి పడదోశారు. నదిలోని విషసర్పాలు భీముణ్ణి చుట్టుముట్టి కరిచాయి. విషానికి విషం విరుగుడుగా పనిచేయడంతో భీముడు పాముల నుంచి బయటపడ్డాడు. పాముల గురించి ఫిర్యాదుచేయడానికి నాగలోకానికి వెళ్ళాడు. నాగరాజు భీముడికి సాదరంగా అతిథి సత్కారాలుచేసి, వెయ్యి ఏనుగుల బలం వచ్చేలా వరమిచ్చి సాగనంపాడు.

ఇప్పుడు భీముణ్ణి చూసి దుర్యోధనాదులు మరింత భయపడసాగారు. అయితే, అదృష్ట వశాత్తు భీముడికి అసూయ అన్నది ఇసుమంత కూడా లేదు. దుర్యోధనుడు అసూయతో పాండవులను వేధించేకొద్దీ, వాళ్ళు మరింత శక్తిసంపన్నులుగా రూపొందుతూ, మరిన్ని విజయాలను పొందసాగారు.

అయితే, పాండవాగ్రజుడైన యుధిష్ఠిరుడికి జూదం అంటే బలహీనత ఉండేది. దానిని అవకాశంగా తీసుకుని దుర్యోధనుడు ధర్మరాజును మాయాజూదంలో ఓడించి, పన్నెండేళ్ళు వనవాసం, ఒక్క యేడు అజ్ఞాతవాసానికి పంపాడు. ఆఖరికి కురుపాండవ యుద్ధం తప్పలేదు. ఉభయపక్షాలలోనూ అసంఖ్యాకులు మరణించారు. దుర్యోధనుడి అసూయ అందరికీ ఆవేదనను కలిగించింది. మహాభారతంలో మరెన్నో నీతులూ, ధర్మసూక్ష్మాలూ ఉన్నాయి. అయితే, నాకు మాత్రం మహాభారతం అనగానే ఒక వ్యక్తి అసూయ కారణంగా ఎందరో చెప్పరాని బాధల పాలయ్యారన్నదే ప్రధాన సందేశంగా కనిపించింది.

ఇప్పుడు మహాత్మాగాంధీ సంగ్రహ జీవిత చరిత్రను చూద్దాం. అది చాలా సులభ సరళమైన భాషలో రచించబడింది. రాజకీయ సంఘటనల ప్రాముఖ్యత గురించి అర్థం చేసుకోలేకపోయినప్పటికీ-ఆ కాలంలో ఒక సాధారణమైన నిరాడంబర వ్యక్తి తన ఆదర్శాల కారణంగానూ, తల్లి పట్ల చూపిన భక్తి కారణంగానూ గొప్ప శక్తివంతమైన వ్యక్తిగా రూపొందిన విషయాన్ని ఆ పుస్తకం కళ్ళకు కట్టినట్టు చూపింది. కుర్రవాడైన మోహన్ దాస్, హరిశ్చంద్ర నాటకాన్ని ఏకాగ్రతతో చూడడాన్ని రచయిత చాలా వివరంగా కళ్ళకు కట్టినట్టు వివరించాడు.



ఆ సమయంలో నేను కథను పూర్తిగా అర్థం చేసుకోలేక పోయాను. కాని, ఎన్ని కష్టాలు ఎదురైనా హరిశ్చంద్రుడు అబద్ధమాడడన్న విషయం మాత్రం తెలిసింది.

ఆ రోజుల్లో సినిమాలు ఎక్కువగా లేవు. రెండు మూడు నెలలకు ఒకసారి సినిమాకు వెళ్ళేవాళ్ళం. చాలా వరకు తెలుగు సినిమాలే. అవీ పౌరాణిక చిత్రాలు కావడంతో బాల భారతం చదివిన అనుభవం బాగా ఉపయోగ పడేది. సినిమా హాల్లో కూర్చోగానే ధర్మరాజు, లేదా కుంతి నా ఊహల్లో కదలాడేవారు.

మహాభారతానికి ఉన్న విలక్షణమైన గుణం ఏమంటే–శ్రీకృష్ణుడు తప్ప తక్కిన పాత్రలన్నీ మానవమాత్రులే. అవన్నీ కూడా జీవితం గురించి ఆలోచించడానికి కావలసినంత విషయాన్ని సమకూరుస్తాయి.

త్వరలో బడికి వెళ్ళడం ప్రారంభించాను. అది క్రిస్టియన్ స్కూల్ గనక బైబిల్ కథలు చదవవలసిన నిర్బంధం నాకు ఏర్పడింది. అందులోని పాత్రలు నా ఊహాశక్తిని పెంచాయి. శాంసన్, డేవిడ్, గోలియత్ పాత్రలు ఎంతో ఆసక్తి కలిగించాయి. తెలిసీ తెలియని అసంఖ్యాక మైన కారణాల ద్వారా పిల్లల మనసు అభివృద్ధి చెందుతుంది. వాటిలో కీలకమైన వాటిని గుర్తించవచ్చు.

నా వరకు తల్లితండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు గల నా కుటుంబాన్ని దాటి బయటి ప్రపంచంలో అడుగు పెట్టడానికి బాల భారతం తొలిమెట్టుగా దోహదం చేసిందని భావిస్తున్నాను. ఆ పుస్తకాన్ని పెద్దలు, వాళ్ళ కోసమే కొని ఉంటారనుకుంటాను. దానివల్ల తప్పక ప్రయోజనం పొంది వుంటారనే భావిస్తు న్నాను. బడికి వెళ్ళడానికి వెనుకాడిన రోజుల్లో ఆ పుస్తకాన్ని చదివామన్న విషయం దాదాపు డెబ్భై యేళ్ళ తరవాత కూడా నాకు ఇంకా సంతోషకరమైన జ్ఞాపకంగా ఉంటున్నది!



# చందమామ ఇండియా క్విజ్ - 11

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

వారి బాల్యంలో జరిగిన విశేషాలనుబట్టి ప్రముఖులు కొందరిని ఈ నెల క్విజ్‌లో గుర్తు చేసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్ - 11 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఫిబ్రవరి 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. డా. అంబేద్కర్ పేరు భీమారావు. అందులో భీమ్ అన్నది ఆయన తల్లిపేరులో ఒక భాగం. ఆమె పూర్తి పేరేమిటో మీకు తెలుసా?
2. కాబోయే భర్త పుట్టిన సంవత్సరమే ఆమె పుట్టింది. పదమూడవ యేటనే ఇరువురికీ వివాహమయింది. వారెవరు? ఏ సంవత్సరంలో వివాహమయింది?
3. తన 14వ యేట 'బానాఫూల్' అనే కవితా సంకలనాన్ని రచించిన ఆ యువకవి ఎవరు?
4. కర్ణాటక మంగళూరు సారస్వత్ కుటుంబంలో ఆమె జన్మించింది. 'పునరుజ్జీవ వ్యక్తి'గానూ 'భారతీయ సంస్కృతి ఉన్నత పూజారిణి'గానూ ఉత్తరోత్తరా పేరుగాంచింది. ఆమె ఎవరు?
5. యువప్రాయంలో ఉన్న తన కుమారుడు కొన్ని కాగితాలను పొయ్యిలోకి విసిరి వేయడం అతని తల్లి చూసి ఏమని అడిగినప్పుడు, ''నా సర్టిఫికేట్లు! అవినాకు అవసరం లేదు,'' అని జవాబిచ్చాడు ఆ కుర్రవాడు. ప్రముఖ గాంధేయవాదిగా పెరిగి పెద్దవాడయ్యాక అతడి పేరేమిటి?

# పాపాయి ఏడుపు

అక్బర్ చక్రవర్తి అభిమానాన్ని పొందడానికి ఆస్థానంలోని పలువురు ఉద్యోగులు, ప్రముఖులు ఆయన్ను తరచూ పోటీ పడి పొగుడుతూండేవారు. ఇది బీర్బల్‌కు వింతగా తోచి, వీళ్ళు రాజోద్యోగులా? ఆయన పెంపుడు కుక్కలా? అని ఆశ్చర్యపోయేవాడు. ఒకనాడా మాట ఉండబట్టలేక వాళ్ళ ఎదుటే అనేశాడు.

దాంతో ఆస్థానోద్యోగులకు కోపం వచ్చి, ''బీర్బల్, మమ్మల్ని అలా అన్నందుకు క్షమాపణ చెప్పు. లేదా ఆ మాటను ఉపసంహరించుకో,'' అన్నారు. ''ఎందుకూ?'' అని అడిగాడు బీర్బల్. ''మేము కుక్కలు కాముగనక,'' అన్నారు రాజోద్యోగులు.

''అది నాకూ తెలుసు కదా!'' అన్నాడు బీర్బల్.

''మరి మమ్మల్ని కుక్కలతో పోలుస్తావెందుకు?'' అని నిలదీశారు రాజోద్యోగులు.

''కుక్కలకు తోక ఉంది. మీకు అది లేదు. కుక్క యజమానిని చూడగానే తోకను ఆడిస్తుంది. మీరు రాజు కనిపించగానే తెగ పొగుడుతూ నాలుకను ఆడిస్తున్నారు. అదొక్కటే తేడా. ఆయన అసంబద్ధమైన విషయం చెప్పినా 'ఆహా, ఓహో' అని ఆకాశానికి ఎత్తుతారెందుకు?'' అని అడిగాడు బీర్బల్.



''అది మా ఇష్టం. దానిని పరిహసించడానికి నువ్వెవరు? మనుషులను కుక్కలంటావా?'' అన్నారు ఉద్యోగులు మరింత కోపంగా.

''మీరందరూ మనుషులే కాని వెన్నెముక మాత్రమే లేదు,'' అన్నాడు బీర్బల్.

''ఏమిటి నువ్వంటున్నది!'' అని అడిగారు వాళ్ళు.

''మీలో ధైర్యం లేదంటున్నాను. వాస్తవం గనక అది మీకు కటువుగా కనిపిస్తున్నది. నిజం నిప్పులాంటిది కదా,'' అన్నాడు బీర్బల్

చిన్నగా నవ్వుతూ.

''మా మాట సరే. మరి నువ్వు మాకన్నా మహా ధైర్య శాలివా?'' అని అడిగారు ఉద్యోగులు.

''అందులో సందేహం దేనికి? ఏం చెయ్యమంటారో చెప్పండి. చేసి చూపిస్తాను,'' అన్నాడు బీర్బల్.



''ముందే అనుమతి పొందకుండా రాజసభకు, చక్రవర్తి వచ్చాక నువ్వు ఆలస్యంగా రాగలవా?'' అని అడిగాడు ఒక ఉద్యోగి.

రాజు కొలువుదీరే సభకు, సభికులు చక్రవర్తికన్నా ముందుగానే రావాలన్న చట్టం అమలులో ఉండేది. ఆలస్యంగా వచ్చినా, ముందే అనుమతి పొందకుండా రాకపోయినా వారిని చక్రవర్తి కఠినంగా శిక్షించేవాడు. ఆ సంగతి ఎరిగిన బీర్బల్ తను చేయబోయే పనికి పడనున్న శిక్షను తలుచుకుని ఒక్క క్షణం భయపడ్డాడు. కాని భయపడితే సాధించేదేమీ ఉండదని గ్రహించి, శిక్షనుంచి తప్పించుకునే ఉపాయం ఏమిటా అని ఆలోచిస్తూ, ''సరే, రేపు చక్రవర్తి సభకు వచ్చేప్పుడు నేను సభలో ఉండను. ముందు అనుమతి పొందకుండానే సభకు రాకుండా ఉండిపోతాను,'' అన్నాడు.

ఈ దెబ్బతో చక్రవర్తి వద్ద బీర్బల్‌కు ఉన్న పలుకుబడి కాస్త ఎగిరి పోగలదని సభికులు లోలోపల ఎంతగానో సంతోషించారు.

మరునాడు చక్రవర్తి కొలువుకూటానికి వచ్చేసరికి బీర్బల్ తప్ప తక్కిన వారందరూ తమ తమ ఆసనాలలో కూర్చుని ఉన్నారు. చక్రవర్తి రాగానే అందరూ లేచి నిలబడి, ఆయనకు వంగి నమస్కరించారు.

సభను పరిశీలించి చూసిన చక్రవర్తి, ''బీర్బల్ ఎక్కడ? రాలేనని ఎవరితోనైనా కబురు చేశాడా?'' అని అడిగాడు.

''లేదు ప్రభూ,'' అన్నాడు దానికి సంబంధించిన అధికారి.

''అనుమతి లేకుండా ఇంటి వద్ద కూర్చోవడానికి అతడికి ఎంత ధైర్యం? భటుణ్ణి పంపి వెంటనే రప్పించండి,'' అన్నాడు చక్రవర్తి కోపంగా.

అధికారి ఆజ్ఞతో అక్కడి నుంచి వెళ్ళిన భటుడు గంట సేపు తరవాత తిరిగి వచ్చి, ''పాపాయి ఏడుపు ఆపగానే వస్తానని బీర్బల్ చెప్పమన్నాడు ప్రభూ!'' అన్నాడు.



''నా ఆజ్ఞనే ధిక్కరిస్తాడా? పాపాయి ఏడుపు ఆపడం అంత కష్టమైన కార్యమా? బీర్బల్‌ను తెలివైనవాడనీ, ప్రతి సమస్యకూ పరిష్కారం చూపగలడనీ భావించానే!'' అన్నాడు అక్బర్ ఆవేశంతో.

ఒక్క నిమిషం సభలో నిశ్శబ్దం అలముకున్నది. ''బీర్బల్‌ను ఉన్నపళాన ఇక్కడికి తీసుకురండి. రానంటే కాళ్ళు చేతులు బంధించి మరీ లాక్కురండి,'' అన్నాడు చక్రవర్తి.

కొంతసేపటికి అక్కడికి వచ్చిన బీర్బల్‌ను చక్రవర్తి నఖశిఖ పర్యంతం తేరిపార చూశాడు.

''ప్రభువులు క్షమించాలి. మా మూడేళ్ళ పాపాయి పొద్దుటి నుంచి ఒకటే ఏడుపు. అందుకే రాలేక పోయాను. ఇంకా ఏడుస్తూనే ఉంది,'' అన్నాడు బీర్బల్.

''నీబోటి మేధావికి పాపాయిని సముదాయించడం అంత కష్టమైన పనా?'' అని అడిగాడు అక్బర్ కాస్త వ్యంగ్యంగా.

బీర్బల్ ఉచ్చులో పడ్డాడని సభికులు ఒకరినొకరు చూసుకుంటూ ముసిముసిగా నవ్వుకోసాగారు.

''అక్కడి పరిస్థితిని వివరిస్తే ప్రభువులకు నా సంకట స్థితి అర్థమవుతుంది,'' అన్నాడు బీర్బల్ కంఠస్వరం కాస్త తగ్గించి. ''చెప్పు మరి,'' అన్నాడు అక్బర్ ఆదుర్దాగా.

''పాపాయి చెరుకు కావాలని ఏడ్వడం మొదలు పెట్టింది. చెరుకుగడ తెప్పించి ఇచ్చాను. అయినా ఏడ్వడం మానలేదు. 'ఇంకేం కావాలి?' అని అడిగాను. చెరుకు రసం కావాలన్నది. ఎంతో కష్టపడి చెరుకు రసం తీసి లోటాలో అందించాను. లోటాను నేలకేసి విసిరికొట్టి, 'ఆ రసాన్ని లోటాలోకి తీసి ఇవ్వు,' అంటూ మరింత గట్టిగా ఏడ్వసాగింది. కింద పారబోసిన చెరుకు రసాన్ని మళ్ళీ లోటాలోకి నేనెలా తీసి ఇవ్వగలను ప్రభూ! ఇంకా ఏడుస్తూనే ఉంది. అందుకే నేను సమయానికి సభకు రాలేకపోయాను,'' అన్నాడు బీర్బల్ పశ్చాత్తాపంతో.

''పసిబిడ్డ ఏడుపు మానిపించలేనివాడివి, నాకెలా సలహాదారుగా ఉండగలవు బీర్బల్?'' అన్నాడు అక్బర్ ఆశ్చర్యంగా.

''పిల్లల అల్లరి అలాంటిది ప్రభూ. తమరెప్పుడైనా ఏడ్చే పిల్లలను నవ్వించడానికి

ప్రయత్నించారా ప్రభూ?'' అని అడిగాడు బీర్బల్.

''లేదు,'' అన్నాడు అక్బర్.

''ప్రయత్నించి చూస్తే మీకే అది తెలుస్తుంది ప్రభూ,'' అన్నాడు బీర్బల్.

''అదెంత పని? తీసుకురా ఆ పాపాయిని,'' అన్నాడు అక్బర్.

'నేనే మూడేళ్ళ పాపాయిగా ఏడుస్తాను. మీరు పెద్దవారుగా నన్ను నవ్వించండి చాలు,'' అన్నాడు బీర్బల్.

''క్షణాల్లో నవ్వించగలను,'' అన్నాడు అక్బర్ ధీమాగా.

బీర్బల్ పసిబిడ్డలా నేలపై బడి కాళ్ళు చేతులు కొట్టుకుంటూ ఏడుపు లంకించుకున్నాడు. అక్బర్ లేచి, అతణ్ణి సమీపించి, ''ఏడవకు పాపా, ఏడవకు. ఏం కావాలో చెప్పు,'' అన్నాడు ఆప్యాయంగా.

''నాకు బంగారు ఉంగరం కావాలి!'' అన్నాడు బీర్బల్ పసిబిడ్డ కంఠస్వరంతో.

అక్బర్ వేలికి ఉన్న ఉంగరం తీసి బీర్బల్‌కు ఇచ్చాడు. దాన్ని తీసుకున్న బీర్బల్ మళ్ళీ ఏడ్వడం మొదలు పెట్టాడు.

''ఉంగరం ఇచ్చాను కదా? ఇంకా ఎందుకు ఏడుస్తావు?'' అన్నాడు అక్బర్.

''నాకు ఏనుగు కావాలి!'' అన్నాడు బీర్బల్ ఏడుస్తూనే. అక్బర్ ఒక పిల్ల ఏనుగును తెప్పించాడు. అయినా బీర్బల్ కాళ్ళు చేతులు కొట్టుకుంటూ ఏడుస్తూనే ఉన్నాడు.

''ఇంకా ఏం కావాలి?'' అని అడిగాడు అక్బర్ కాస్త విసుగ్గా.

''ఏనుగును ఆ ఉంగరం గుండా పోయేలా చేయాలి!'' అంటూ బీర్బల్ మళ్ళీ ఏడ్వసాగాడు.

''అసాధ్యం!'' అన్నాడు అక్బర్ కోపంగా.

''కింద పోసిన చెరుకు రసాన్ని లోటాలో నింపడం కూడా అసాధ్యం ప్రభూ,'' అంటూ బీర్బల్ లేచి నిలబడ్డాడు చిన్నగా నవ్వుతూ.

అక్బర్ చక్రవర్తి కూడా నవ్వుతూ, ''అవును బీర్బల్. పసిబిడ్డను ఓదార్చడం చాలా కష్టమైన పనే. నువ్వు రాకపోవడానికి కారణం ఇప్పుడర్థమయింది,'' అంటూ వెళ్ళి సింహాసనంలో కూర్చున్నాడు.

తనను సవాలు చేసిన ఆస్థానోద్యోగుల కేసి బీర్బల్ ఒకసారి చూశాడు. బీర్బల్‌ను ఇబ్బందికి గురిచెయ్యాలనుకున్నవాళ్ళు సిగ్గుతో తలలు వంచుకున్నారు.



# స్నేహం!

చక్రధరపురంలో భద్రయ్య, కనకయ్య, భూషయ్య సన్నిహితంగా ఉండేవారు. భద్రయ్య, కనకయ్య వ్యాపారులు; భూషయ్య రైతు.

ఒకనాడు భద్రయ్య భూషయ్యను చూడవచ్చి, ''కనకయ్య చేసినపని చూశావా? పొరుగూరి వ్యాపారుల మధ్య నన్ను అవమానించాడు. ఇక నుంచి అతనితో ఎలాంటి సంబంధాలూ పెట్టుకోదలచలేదు,'' అన్నాడు ఆవేశంగా.

ఆ మాట విన్న భూషయ్య, ''ఇంతకూ ఏం జరిగింది? కావాలంటే ఇప్పుడే వెళదాం, రా. నేనే అతనితో మాట్లాడుతాను,'' అన్నాడు సానుభూతిగా.

''జరిగిన అవమానం చాలు. తిరగదోడి మళ్ళీ బాధ పడడం నాకిష్టం లేదు. ఈ క్షణం నుంచి ఆ ద్రోహిముఖం చూడను,'' అంటూ సుడిగాలిలా వెళ్ళిపోయాడు భద్రయ్య.

ఆ ఇద్దరి మధ్య ఏం జరిగిందో భూషయ్య ఊహించలేక పోయాడు. తన ఆప్తమిత్రుడికి ఇంత క్షోభ కలిగించిన కనకయ్యతో తనూ ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకూడదనుకున్నాడు.

వారం రోజులు గడిచింది. ఆరోజు సాయంకాలం భూషయ్య కనకదుర్గ గుడికి వెళుతూండగా- భద్రయ్య, కనకయ్య గుడి నుంచి నవ్వుతూ మాట్లాడుకుంటూ రావడం చూసి నిర్ఘాంతపోయాడు.

రాత్రి భోజనం ముగించి మౌనంగా పడుకోబోయిన భూషయ్యను భార్య, ''ఏమిటి అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారు?'' అని అడిగింది.

భూషయ్య భద్రయ్య గురించి చెప్పాడు. అంతా విన్న అతని భార్య, ''ఇందులో వింతేముంది! మనసెరిగిన స్నేహితుల మధ్య, అన్యోన్యంగా ఉండే ఆలుమగల మధ్య తలెత్తే కోపతాపాలు, పొరపొచ్చాలు పాలపొంగులాంటివే కదా. తొందరపడి నువ్వు వాళ్ళ మధ్య జోక్యం చేసుకోకపోవడం మంచిదయింది,'' అన్నది నవ్వుతూ.

-మంజుభారతి





# మానవ జన్మ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు మగధరాజ్యంలో ఒక పేదవాడుగా జన్మించి, మగధరాజు పరివారంలో ఒకడుగా ఉంటూ ఉండేవాడు.

మగధదేశానికీ, అంగదేశానికీ మధ్యగా చంపానది ప్రవహిస్తూ ఉండేది. ఆ నది అడుగున నాగరాజ్యం ఉండేది. చంపేయ్యుడు ఆ రాజ్యానికి రాజు.

మగధరాజ్యానికీ, అంగరాజ్యానికీ మధ్య ఎల్లప్పుడూ యుద్ధాలు జరుగుతూండేవి. అలా జరిగిన ఒక యుద్ధంలో మగధరాజు ఓడిపోయాడు. ఆయన తన గుర్రం మీద ఎక్కి పారిపోతూ చంపానది వద్దకు వచ్చి, తన శత్రువు చేతికి చిక్కి చావటంకంటె ఆత్మహత్య చేసుకోవటం మంచిదనే ఉద్దేశంతో, తన గుర్రంతో సహా నదిలోకి ఉరికాడు. మగధ రాజుతో సహా గుర్రం నది అడుగున వున్న నాగరాజు కొలువు కూటంలో వాలింది. నాగ రాజు తన సింహాసనం నుంచి లేచి వచ్చి మగధ రాజుకు ఆదరపూర్వకంగా స్వాగతమిచ్చి, ఆయన కథ యావత్తూ తెలుసుకున్నాడు.

"జరిగినదానికి మీరు విచారించకండి. అంగరాజుతో జరిగే ఈ యుద్ధంలో మీకు విజయం లభించటానికినేను తోడ్పడగలను," అని నాగరాజు తన అతిథికి మాట ఇచ్చాడు.

ఆ ప్రకారమే నాగరాజు మగధరాజుకు యుద్ధంలో సహాయపడ్డాడు. అంగరాజు మగధరాజు చేతిలో చనిపోయాడు. మగధ రాజు రెండు దేశాలకూ రాజై వైభవంగా పరి పాలించసాగాడు.

అది మొదలు మగధరాజుకూ, నాగ రాజుకూ బద్ధమైత్రి ఏర్పడింది. మగధరాజు యేటా ఒక రోజున సపరివారంగా చంపానదీ తీరానికి వెళ్ళేవాడు. ఆ రోజున నాగరాజు నది

జాతక కథలు



నుంచి వైభవంతో వెలువడి మగధరాజు తెచ్చిన బహుమానాలు అందుకునేవాడు.

మగధరాజు పరివారంలో ఒక భృత్యుడుగా ఉంటున్న బోధిసత్వుడు ఏటా నాగరాజు వైభవాన్ని కళ్ళారా చూస్తూ వచ్చాడు. ఆయన చనిపోయే క్షణాన ఈ నాగరాజు వైభవమే ఆయన మనసులో మెదిలింది. ఆ కారణం చేత ఆయన నాగరాజు చనిపోయిన ఏడవ నాడు తానే నాగరాజుగా జన్మించాడు.

కాని కిందటి జన్మలో పుణ్యాత్ముడై ఉండిన కారణం చేత ఆయనకిప్పుడు తన పాము శరీరం చూసుకోగానే ఎంతో రోత పుట్టింది; నాగరాజు ఐశ్వర్యాన్ని కాంక్షించినందుకు ఆయనకు పశ్చాత్తాపం కూడా కలిగింది. ఆయన ఆత్మహత్య చేసుకుని ఈ జన్మ చాలింతామనుకుంటున్న సమయంలో సుమన అనే నాగకన్య తన చెలికత్తెలను వెంటబెట్టు కుని వచ్చి, ఆయనకు ప్రణామం చేసింది.

సుమనను చూడగానే నాగరాజు ఆత్మహత్యా ప్రయత్నం మానేసి, ఆమెను తన భార్యను చేసుకుని నాగలోకాన్ని పరిపాలించసాగాడు.

కాని కొంత కాలానికి ఆయనకు ఉపవాసాలూ, నిష్ఠలూ జరిపి, పుణ్యం సంపాదించుకోవాలనే కోరిక కలిగింది. ఇందుకుగాను ఆయన తన లోకాన్ని విడిచి మానవలోకంలోకి వెళ్ళ నిశ్చయించాడు. ఉపవాస దినాలు వచ్చినప్పుడాయన తన భవనం వెలువడి, ఒక రహదారి పక్కన ఉండే చీమలపుట్ట మీద చుట్టచుట్టుకు పడుకుని, ''నన్ను ఏ గరుడ పక్షి అయినా తన్నుకు పోనీ! ఏ పాముల వాడైనా పట్టుకుపోనీ!'' అనుకునేవాడు.

కానీ ఆయన అనుకున్నట్టు జరగలేదు. రహదారి వెంట వెళ్ళే మనుషులు పుట్ట మీద చుట్టుకుని ఉన్న పామును చూసి దేవతగా భావించి, పూలతో, పూజించసాగారు. మరి కొందరు ఆ నాగరాజుండేపుట్టవద్దఒకఆలయం కట్టారు. ప్రతిరోజూ అక్కడికి రకరకాల ప్రజలు వచ్చి పిల్లలు కావాలనీ, తమ శరీర వ్యాధులు నయం కావాలనీ, తమ కోరికలు తీరాలనీ మొక్కుకోసాగారు.

నాగరాజు ఉపవాసదినాలన్నీ ఈ విధంగా పుట్ట మీద గడిపి ప్రతి మాసమూ కృష్ణపాడ్యమి నాడు ఇంటికి తిరిగిపోతూ ఉండేవాడు.

ఒకనాడు సుమన ఆయనకు, ''స్వామీ, మీరు తరుచూ మానవలోకంలోకి వెళుతు

న్నారు. ఆ లోకం అపాయకరమైనది, భయం కరమైనది. మీకేదైనా ప్రమాదం జరిగే పక్షాన నాకా సంగతి తెలిసేదెలా?'' అని అన్నది.

నాగరాజు సుమనను ఒక కొలను వద్దకు తీసుకుపోయి, ''ఈ నీరు చూడు! నాకేదైనా దెబ్బ తగిలితే ఈ నీరు మురికి అవుతుంది. నన్నేదైనా గరుడపక్షి తన్నుకు పోతే ఈ నీరు ఇగిరిపోతుంది. అలా కాక, ఏ మంత్రగాడైనా నన్ను పట్టుకున్న పక్షంలో ఈ నీరు రక్తవర్ణంగా మారుతుంది,'' అని ఆమెతో చెప్పాడు.

కాశీనగరవాసి అయిన ఒక బ్రాహ్మణ యువకుడు తక్షశిలకు వెళ్ళి అక్కడ వశీకరణవిద్య నేర్చుకుని, తన దేశానికి తిరిగిపోతూ నాగరాజు పడుకునే చోటికి రహదారి వెంబడి వచ్చాడు. పుట్టపైన చుట్టుకుని పడుకుని ఉన్న నాగరాజు అతని కంట పడ్డాడు. వెంటనే ఈ యువకుడు పామును మంత్రంతో బంధించి పట్టుకుని, ఒక బుట్టలో పెట్టి, ఒక గ్రామానికి తీసుకుపోయి, అక్కడ ఆ పామును ఆడించాడు.

ఇది చూడవచ్చిన గ్రామస్థులు పాములాటకు చాలా సంతోషించి బ్రాహ్మణ యువకుడికి డబ్బూ, ఇతర విలువైన బహుమానాలూ ఇచ్చారు.

''ఈ కుగ్రామంలోనే ఇంత డబ్బు వస్తే ఇంక పట్టణాలలో పాము నాడిస్తే ఇంకా ఎంత వస్తుందో!'' అని బ్రాహ్మణ యువకుడికి ఆశ కలిగింది. అతను పామును వెంటతీసుకుని కాశీ నగరానికి బయలుదేరి, బండి మీద ప్రయాణం చేస్తూ, ఒక మాసానికల్లా కాశీ నగ



రాన్ని చేరుకున్నాడు. ఈ నెల రోజులపాటూ నాగరాజు ఉపవాసాలు చేశాడేగాని, ఆహారంగా బ్రాహ్మణ యువకుడిచ్చిన కప్పలను తాకనేలేదు.

''నేను ఆహారం తిన్నంతకాలమూ నాకీ బుట్టలో మంత్రశక్తులున్న ఈ యువకుడి వల్ల ఖైదు తప్పదు!'' అని ఆయన తెలుసుకున్నాడు.

బ్రాహ్మణ యువకుడు నాగరాజును కాశీనగర సమీపాన గల అనేక గ్రామాలలో ఆడించి అక్కడి ప్రజలనుంచి అంతులేని డబ్బు సంపాదించాడు.

ఈ పాములాట వినోదం గురించి త్వరలోనే కాశీరాజుకు తెలియవచ్చింది. ఆయన బ్రాహ్మణయువకుణ్ణి పిలిపించి తన వినోదం కొరకు పాములాట ఏర్పాటు చేయించాడు.

ఈలోపల నాగలోకంలో సుమన, నెల రోజులుగా తన భర్త ఇంటికి రాకపోవటం గమనించి ఏదో జరిగివుంటుందని భయపడి, నిజం తెలుసుకునేటందుకు కొలను వద్దకు వెళ్ళింది. కొలనులో నీరు ఎర్రగా, రక్తం రంగులో ఉన్నది. ఎవడో పాములవాడు తన భర్తను పట్టుకున్నట్టు సుమన తెలుసుకున్నది. ఆమె తన భర్తను వెతుక్కుంటూ బయలుదేరి, దారిలో విచారిస్తూ, త్వరలోనే కాశీనగరం చేరుకున్నది.

ఆమె అక్కడికి చేరేసరికి, పాములాట జరుగుతున్నది. రాజుగారూ, అనేకమంది ప్రజలూ చేరి వినోదం చూస్తున్నారు. తన భార్యను చూడగానే నాగరాజు సిగ్గుపడి, ఆట మాని, చప్పున బుట్టలోకి వెళ్ళిపోయాడు.

సుమన మానవస్త్రీ రూపం ధరించి రాజును సమీపించి, చేతులు జోడించి, "మహారాజా, నాకు పతిభిక్ష పెట్టండి!" అని వేడుకున్నది.

ఇంతలోనే పాము కూడా బుట్టలో నుంచి బయటికి పాకివచ్చి, అందరూ చూస్తూండగానే, ఒక ఆకర్షణీయమైన యువకుడి ఆకారం ధరించింది. కాశీరాజు ఆ నాగదంపతులను చూసి ఎంతో ముచ్చటపడి, వారిని వారం రోజుల పాటు తన అతిథులుగా ఉంచుకుని, అటు తరవాత వారి వెంట తాను కూడా సపరివారంగా ప్రయాణమై నాగలోకానికి వెళ్ళాడు.

నాగలోకంలోని ఐశ్వర్యమూ, అందమూ, వైభవమూ చూసి కాశీరాజుకు చెప్పలేనంతాని ఆశ్చర్యం కలిగింది.

"ఇంత వైభవంలో ఓలలాడుతూ మీరు పాము రూపంలో చీమల పుట్టపై చుట్టచుట్టుకుని పడుకోవటానికి కారణమేమిటి?" అని కాశీరాజు నాగరాజును అడిగాడు.

"రాజా, ఇక్కడ ఎంత వైభవం ఉన్నప్పటికీ, జన్మరాహిత్యం పొందే సౌకర్యం మీ మానవ లోకంలో మాత్రమే ఉన్నది!" అని నాగరాజు ఆయనకు సమాధానం చెప్పాడు.

కాశీరాజు ఈ మాట విని పరమానందం చెందాడు. ఆయన తన రాజ్యానికి తిరిగి వెళ్ళేటప్పుడు నాగరాజు ఆయనకు అంతులేని బహుమానాలిచ్చి పంపాడు.





# రామాయణం

సుగ్రీవుడి మాటలు విని రాముడు, ''మీ ఇద్దరిమధ్యా గల వైరకారణమేమిటో తెలుసు కోవాలని ఉన్నది. ఆ కారణమూ, మీ బలా బలాలూ తెలుసుకున్న మీదట నీకు సుఖం కలిగే మార్గం ఆలోచించ గలుగుతాను,'' అన్నాడు.

ఆ మాటవిని కొంతసేపు మౌనం వహించిన సుగ్రీవుడు ఇలా చెప్పాడు:

''మా అన్న అయిన వాలిని నా తండ్రీ, నేనూ ఎంతో గౌరవంతో చూసే వాళ్ళం. మా తండ్రి పోయాక, పెద్దవాడు గనక వాలి రాజ్యా నికి వచ్చాడు. నేను వాలికి సేవకుడి లాగా ఎంతో వినయ విధేయతలు చూపే వాణ్ణి. దుందుభి అనేవాడి పెద్ద కొడుకు మాయావి అనే రాక్షసుడు చాలా గొప్ప పరాక్రమశాలి. ఒక స్త్రీ విషయంలో మాయావికీ, వాలికీ తగాదా వచ్చింది. ఒకనాటి అర్ధరాత్రివేళ ఆ మాయావి కిష్కింధా ద్వారం వద్దకు వచ్చి, పెద్ద పెట్టున గర్జిస్తూ వాలిని యుద్ధానికి పిలి చాడు. వాలి నిద్రమేలుకొని మాయావి మదం అణచటానికి బయలుదేరాడు. నేనూ, ఆడ వాళ్ళూ ఎంత ఆపినా వాలి ఆగలేదు. అతను ఒంటరిగా పోతున్నాడే అని నేను కూడా వెంట వెళ్ళాను.

''మాయావి మా అన్నను చూస్తూనే భయ పడి పారిపోసాగాడు. మేమతని వెంటపడ్డాం. ఇంతలో చంద్రోదయం కూడా అయింది. మాకూ తనకూ ఉండే దూరం క్రమంగా తగ్గుతూండటం చూసి మాయావి ఒకబిలంలో దూరాడు.

కిష్కింధా కాండ-2



''వాలి బిలంలోకి వెళ్ళి మాయావిని చంపివస్తాననీ, తాను వచ్చేదాకా నన్ను బిలం వెలుపల ఉండమనీ చెప్పాడు. నేను కూడా వస్తానంటే వినక, తన పాదాలమీద ప్రమాణం చేయించుకుని వాలి అమితావేశంతో ఆ బిలం ప్రవేశించాడు.

''మా అన్న కోసం ఆ బిల ద్వారం వద్ద పూర్తిగా ఒక సంవత్సరం కాచుకుని ఉన్నాను. వాలి జాడలేదు. వాలి చనిపోయి ఉంటాడే మోనని నాకు భయమూ, అనుమానమూ కలిగాయి. నా భయానికి తగ్గట్టుగా బిలం నుంచి నురుగుతో కూడిన ఎర్రని రక్తం రాసాగింది. లోపల నుంచి గర్జనలూ, ఆక్రంద నలూ వినిపించాయి. ఆక్రందన ధ్వని వాలిదిలాగా నాకు తోచింది. ఈ లక్షణాలన్నీ గమనించి వాలి చనిపోయాడనుకుని నాకు భయమూ, దుఃఖమూ కలిగాయి. నేను ఆ బిల ద్వారాన్ని పెద్ద కొండరాయితో మూసి, వాలికి జలతర్పణాలు విడిచి కిష్కింధకు తిరిగి వచ్చాను.

''వాలి మరణవార్త నేనై చెప్పకపోయినప్పటికీ మంత్రులు నా నుంచి రాబట్టి, తమలో తాము ఆలోచించుకుని నాకు పట్టాభిషేకం చేశారు. నేను రాజ్యపాలన చేస్తూండగా వాలి మాయావిని చంపేసి తిరిగి వచ్చాడు.

''నేను రాజు నయ్యానని తెలిసి వాలి మండిపడ్డాడు. మంత్రులను బంధించాడు. నన్ను నానా మాటలూ అన్నాడు. నేను గౌరవంగా వాలికి నమస్కారం చేశాను. అతడు నన్ను ఆశీర్వదించ లేదు. నా కిరీటం తీసి అతని పాదాల దగ్గిర పెట్టాను. కాని అతని కోపం చల్లారలేదు. అతన్ని రాజ్యం చెయ్యమని వేడుకున్నాను. బిలం దగ్గర నేను చూసినదీ, విన్నదీ చెప్పాను. బిలానికిరాయి ఎందుకు అడ్డంగా పెట్టానో చెప్పాను. నేను రాజ్యాభిషేకం కోరలేదనీ, రాజ్యక్షేమం కోరి మంత్రులే నాకు పట్టం గట్టారనీ అన్నాను. నువ్వు లేనప్పుడు రాజుగా పనిచేశాను గాని, ఇప్పుడు నీకు యువరాజు నేనని కూడా చెప్పాను.

''వాలి ఇదేదీ లక్ష్యపెట్టాడు కాడు. తన కిష్టులైన మంత్రుల ముందు నన్ను నానా దుర్భాషలూ ఆడాడు. అతను బిలంలో ప్రవేశించాక ఒక ఏడాదిపాటు మాయావి కనిపించనే లేదట. తరవాత వాణ్ణీ, వాడి బంధువుల నందరినీ చంపాడట. రక్తం ప్రవహించ నారంభించగానే దుర్గంధం భరించలేక బిల ద్వారం

వద్దకు వచ్చి నన్ను పిలిచాడట. నేను తన కోసం వేచి ఉండక పోగా, తనను బిలంలో బంధించ టానికి రాయి అడ్డు పెట్టానని వాలి తన మంత్రులతో అన్నాడు. ఇలా నాపై నింద మోపిన అనంతరం అతను నన్ను కట్టుబట్టతో కిష్కింధ నుంచి వెళ్ళగొట్టేశాడు. నా భార్యను కాజేశాడు.

''ఈ విధంగా అన్న చేత వెళ్ళగొట్టబడి నేను ప్రపంచమంతా తిరిగాను. చిట్టచివరకు నాకీ ఋశ్యమూకం మీద నిలువ నీడ దొరికింది. ఎందుకంటే ఒకానొక కారణం చేత వాలి ఈ పర్వతం పైన అడుగు పెట్టలేడు. నావల్ల ఏ తప్పూ లేకపోయినప్పటికీ నేనిలా కష్టాల పాలయ్యాను.

''ఇక వాలియొక్క శక్తిసామర్థ్యాలు చెబుతాను. అతను సూర్యోదయానికి పూర్వమే నాలుగు దిక్కుల సముద్రాలూ సునాయాసంగా చుట్టివస్తాడు. పర్వత శిఖరాలపైకెక్కి కొండరాళ్ళను బంతుల్లాగా ఎగరేసి పట్టుకుంటాడు. పెద్దపెద్ద అడవి మానులను అవలీలగా విరిచెయ్యగలడు.

''ఇంకొక కథ చెబుతాను. దున్నపోతు రూపంలో దుందుభి అనే మహా బలాశాలి అయిన బలశాలి మహా రాక్షసుడు ఉండేవాడు. వాడిది వెయ్యి ఏనుగుల బలం. వాడు బలగర్వితుడై సముద్రుడి వద్దకు వెళ్ళి తనతో యుద్ధానికి రమ్మని పిలిచాడు. సముద్రుడు మానవరూపంలో పైకి వచ్చి దుందుభితో, ''నీ బోటి యుద్ధ విశారదుడితో యుద్ధం చేసే శక్తి నాకైతే లేదుగాని, అలాటి శక్తి గల వాడెవడైనా



ఉంటే అది హిమవంతుడు. నువ్వు అతనితో యుద్ధం చేస్తే బాగుంటుంది,'' అని చెప్పాడు.

''దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, తన కొమ్ములతో గుండురాళ్ళను విరజిమ్ముతూ, రంకెలు పెట్టి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, 'నాయనా, నేను నీతో యుద్ధం చెయ్యలేను, నన్నెందుకు బాధిస్తావు? అదీ గాక ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసుకుంటున్న కారణం చేత యుద్ధానికి వీలుపడదు. కిష్కింధలో వాలి అనే వానర శ్రేష్ఠుడున్నాడు. యుద్ధంలో అతను నీ తీట తీర్చగలడు,' అని చెప్పాడు.

''దుందుభి కిష్కింధకు వచ్చి ద్వారం వద్ద నేలను గిట్టలతో గీరుతూ ఆర్భాటం చేశాడు. వాడు చేసే ఆగడం సహించలేక వాలి అంతః



ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది. వస్తూనే వాలి దుందుభి కొమ్ములు పట్టుకుని గిరగిరా తిప్పి విసిరి నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు దుందుభి చెవుల నుంచి రక్తం కారింది. క్రమంగా వాలి బలం హెచ్చింది, దుందుభి బలం క్షీణించింది. చివరకు వాలి ఆ రాక్షసుణ్ణి ఎత్తి నేలకు వేసి కొట్టి చంపాడు. అలా చచ్చిన దుందుభి కళేబరాన్ని వాలి ఎత్తి ఆమడ దూరాన వెళ్ళి పడేలాగా విసిరి వేశాడు. ఆ కళేబరం నోట కారే రక్తపు చుక్కలు ఋశ్య మూకం మీది మతంగ మహాముని ఆశ్రమంలో పడ్డాయి. ఆ నెత్తురు చుక్కలు చూసి మతంగుడు మండిపడి ఆశ్రమం దాటి వచ్చి దుందుభి కళేబరాన్ని చూసి, ''ఈ రాక్షస కళేబరాన్ని ఇక్కడికి విసిరినవాడు గాని, వాడి అనుచరులు గాని ఈ వనంలోకి వస్తే చస్తారు!'' అని శపించాడు.

పుర కాంతలతో సహా బయలుదేరి వచ్చాడు. అతను దుందుభితో, 'ఓరీ, నేను నిన్నెరుగుదును. ఎందుకు రంకెలు పెడుతున్నావు? ప్రాణాల మీద ఆశ లేదా?' అన్నాడు. దుందుభి మండిపడి, 'స్త్రీల ఎదట బీరాలు పలకటం కాదు, నాతో యుద్ధం చెయ్యి. ఇప్పుడు కాకపోతే, ఈ రాత్రి అంతా సుఖంగా గడిపి, నీ వానరుల కందరికీ అప్పగింతలు చెప్పి, నీ స్థానంలో మరొక రాజును ఏర్పాటు చేసుకుని, ఆఖరుసారి కిష్కింధ అంతా చూసుకుని రేపు ఉదయం యుద్ధానికి రా! అంతదాకా నీకు గడువిస్తాను,' అన్నాడు.

''వాలి దుందుభిని చూసి హేళనగా నవ్వి, తార మొదలైన అంతఃపుర స్త్రీలను పంపేసి, తనకు ఇంద్రుడిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని యుద్ధానికి వచ్చాడు.

''మతంగ మహాముని శాపం విని ఆ ప్రాంతాల ఉండే వాలి అనుచరులు భయపడి వెళ్ళిపోయి వాలితో ఈ సంగతి చెప్పారు. శాప విమోచనం చెయ్యమని వాలి వేడుకున్నప్పటికీ మతంగుడు అనుగ్రహించలేదు. అది మొదలు వాలి ఈ ఋశ్యమూకం చాయలకు రాడు. ఆ సంగతి తెలిసి, నేను నా మంత్రులతో ఇక్కడ తల దాచుకున్నాను. అదుగో, గుట్టలాగా కనిపించే దుందుభి కళేబరం!

''వాలి బలానికి మరొక ఉదాహరణ కూడా చెబుతాను. ఆ కనిపించే ఏడు సాల వృక్షాలున్నాయే, వాటిలో దేని కాండంలో నుంచి

అయినా దూసుకుపోయేలాగా వాలి బాణం వేయగలడు. ఇంత శక్తిమంతుణ్ణి నువ్వు ఏ విధంగా వధిస్తావో!''

సుగ్రీవుడు చెప్పినదంతా విని లక్ష్మణుడు నవ్వుతూ, ''రాముడు ఏం చేస్తే నీకు నమ్మకం కలుగుతుంది?'' అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, ''నాకు వాలి బల పరాక్రమాలు తెలుసును. అతను ఎన్నడూ ఓటమి ఎరిగినవాడు కాడు. అందుచేతనే అతనికివెరిచి ఇక్కడ ఉన్నాను. నాకు రాముడి పరాక్రమం తెలియదు గద!'' అన్నాడు.

రాముడు దుందుభి కళేబరాన్ని సమీపించి కాలి బొటన వేలితో ఎత్తి, పైకీ కిందికీ ఆడించి విసిరే సరికి అది పది ఆమడల దూరాన వెళ్ళి పడింది.

అది చూసి సుగ్రీవుడు ఆశ్చర్యపడటానికి మారుగా, ''రామా, దీన్ని ఆమడ దూరం విసిరి వేసినప్పుడు వాలి యుద్ధం చేసి బాగా అలిసి ఉన్నాడు. అదీగాక అప్పుడది కొత్త కళేబరం, ఇప్పుడది బాగా ఎండిపోయి తేలిక అయింది. అందుచేత నీకూ వాలికీ గల తారతమ్యం నాకు స్పష్టంగా తెలియలేదు. ఈ సాలవృక్షాలలో దేన్ని గాని దూసుకు పోయే లాగా నువ్వు బాణం వేసినట్టయితే మీ ఇద్దరి బలా బలాలు తెలుసుకోగలుగుతాను,'' అన్నాడు.

రాముడు సరేనని ఒక తీవ్రమైన బాణం ఎక్కుపెట్టే సరికి అది ఏడు సాలవృక్షాల కాండాలలో నుంచీ దూసుకు పోయి, కొండ లోకి చొచ్చుకు పోయి, భూమిని పగల గొట్టు



కుని మళ్ళీ పైకి వచ్చి రాముడి అంబుల పొదిలో ప్రవేశించింది.

ఇది చూసి సుగ్రీవుడు నిర్ఘాంత పోయి, ''రామా, వాలి మాట దేనికి, దేవేంద్రుడు దేవతలందరితో కలిసి వచ్చినా నీ ఎదుట నిలవలేడు. నీ మైత్రి కలగటం నా అదృష్టం! ఇంక నా శత్రువైన వాలిని ఇప్పుడే వధించు,'' అంటూ రాముడి ముందు సాష్టాంగ పడి నమస్కరించాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, ''ఇప్పుడే కిష్కింధకు పోదాం పద. నువ్వు మా కన్న ముందు వెళ్ళి వాలిని యుద్ధానికి పిలువు,'' అన్నాడు.

రామ లక్ష్మణులు, సుగ్రీవుడు మొదలైన వారందరూ కిష్కింధకు వెళ్ళారు. మిగిలిన వారంతా దట్టమైన చెట్ల చాటున దాక్కున్నారు. సుగ్రీవుడు మటుకు దట్టీ బిగించి, వాలికి వినపడేలాగా భయంకరమైన గర్జనలు చేశాడు.

తమ్ముడి గర్జనలు విని మండిపడుతూ వాలి వచ్చాడు. అన్నదమ్ములిద్దరూ ఘోరంగా తన్నుకున్నారు. రాముడు విల్లూ, బాణమూ పట్టుకుని కూడా, వారిద్దరిలో ఎవరు వాలి అయినదీ, ఎవరు సుగ్రీవుడైనదీ తెలుసుకో లేక చూస్తూ ఉండిపోయాడు.

ఈలోపల సుగ్రీవుడు వాలి చేత చావు దెబ్బలు తిని, ఒళ్ళంతా నెత్తురు కారుతూ ఆయాసంతో అటూ ఇటూ చూసి, రాముడు కనబడకపోయేసరికి పారిపోసాగాడు. వాలి అతని వెంట పడ్డాడు. సుగ్రీవుడు వాలికి చిక్కకుండా పారిపోయి ఋశ్యమూకం చేరు కున్నాడు.

''బతికిపోయావు పో!'' అని వాలి వెనక్కు తిరిగి వచ్చేశాడు.

తరవాత రామ లక్ష్మణులూ, హనుమం తుడూ కూడా ఋశ్యమూకానికి తిరిగి వెళ్ళారు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి అవమా నంతో తల వంచుకుని, ''ఇదేంపని? నన్ను తన్నించటానికా వాలిని యుద్ధానికి పిలవమ న్నావు? వాలిని చంపటం చేతకాదని చెప్పి ఉంటే, నేను ఇక్కడి నుంచి కదలనే కదలను గద!'' అన్నాడు.





# మీసాలయ్య-గుండయ్య

కమల గుడి నుంచి ఇంటికి తిరిగి వచ్చే సరికి, ఆమె తండ్రి రామయ్య ఎవరితోనో మాట్లాడుతు న్నాడు. ఆయన కమలను తన కూతురిగా వారికి పరిచయం చేశాడు.

రామయ్యతో మాట్లాడుతున్న వారు తండ్రి, కొడుకులు. కొడుకును కమల రెండు మాసాల క్రితం తన స్నేహితురాలి పెళ్ళిలో చూసింది. అతను పెళ్ళికొడుకు స్నేహితుడు; పెళ్ళి జరిగినంతసేపూ చురుకుగా తిరిగాడు. అతని పేరు రవి.

ఇంతలో రామయ్య లోపలికి వచ్చి, ''వాళ్ళు చాలా గొప్పవాళ్ళు, ఆ అబ్బాయి నిన్ను ఎక్కడో చూసి ఇష్టపడ్డాడట! తండ్రిని తీసుకుని వచ్చాడు. కాని తండ్రి కనీసం పదివేలు కట్నం కావాలంటున్నాడు. మనం తూగలేం. వాళ్ళకు ఇంత ఫలహారం పెట్టి పంపించేద్దాం!'' అన్నాడు కమలతో.

కమల పరధ్యానంగా ఫలహారం తయారు చేసి, వచ్చిన వారికి ఇచ్చింది. రవిని పెళ్ళాడ టానికి ఆమెకు ఇష్టంగానే ఉన్నది. కాని పదివేలు కట్నం ఎక్కడి నుంచి తెచ్చేటట్టు?

రామయ్య వారితో తాను పదివేలు కట్నం ఇచ్చుకోలేనని స్పష్టంగా చెప్పి, ఆ తండ్రీ కొడుకులను వీధి చివరిదాకా సాగనంపాడు.

కాని ఆయన ఇంటికి తిరిగి వచ్చినాక, ''వచ్చిన సంబంధం వదులుకోవడం అవివేకం అవుతుంది! ఈ సంబంధం నీకు నచ్చితే పెళ్ళి చేస్తాను,'' అని కమలతో అన్నాడు.

''మరి కట్నం మాటో?'' అన్నది కమల.

''అదేదో నేను చూసుకుంటాలే! ఈ సంబంధం నీకు ఇష్టమని నీ మొహమే చెబు తున్నది!'' అన్నాడు రామయ్య.

ఆయన అన్నంత పనీ చేశాడు. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవడమూ పదిహేను

25-ఏళ్ళనాటి చందమామ కథ



రోజుల్లో ముహూర్తం నిర్ణయించడమూ కూడా అయిపోయింది! కట్నం డబ్బు ఎలా ఏర్పాటు అవుతున్నదీ కమలకు అంతుబట్టలేదు. తండ్రిని అడిగితే కస్సుమన్నాడు.

రాత్రికి పెళ్ళి అనగా పెళ్ళివారు తరలి వచ్చారు. కరణంగారి ఇల్లు పెళ్ళివారి విడిది.

కమలను అమ్మలక్కలు పెళ్ళి కూతురుగా ముస్తాబు చేస్తూండగా, ''మా వాడి ఎన్నిక చూడాలి! పెళ్ళికూతురు ఏది?'' అంటూ ఒక మనిషి అక్కడికి వచ్చాడు. అతనికి పొడవైన మీసాలూ, గిరజాల జుట్టూ ఉన్నది.

''నా పేరు మీసాలయ్య. పెళ్ళికొడుక్కు తండ్రిలాటి వాణ్ణి!'' అన్నాడు మీసాలయ్య.

కమల ఆయన పాదాలకు నమస్కారం చేసి, ఆశీర్వాదం పొందింది. పెళ్ళివారి తాలూకు పెద్ద అని తెలియగానే, మీసాలయ్యకు ఫలహారం ఏర్పాటు చేసి, రామయ్య చాలా మర్యాదచేశాడు.

మీసాలయ్య ఫలహారం ముగించి, తిన్నగా విడిదికివెళ్ళి, ''మా అమ్మాయి ఎన్నికచూడాలి! పెళ్ళికొడుకు ఏడి? నా పేరు మీసాలయ్య. పెళ్ళికూతురు నాకు కూతురులాటిది!'' అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి రాజయ్యతో.

రాజయ్య మీసాలయ్యకు తన కొడుకు రవిని చూపించి, ''మీ పెద్ద మామగారు!'' అంటూ రవికి పరిచయం చేశాడు.

మీసాలయ్య రోజల్లా పెళ్ళివారింటికీ, విడిదికీ మధ్య తిరుగుతూ తగని హడావుడి చేశాడు. అతను ఎవరితరఫు మనిషి అయినదీ నిర్ధారణ చేసుకున్నవారు లేరు.

ఆ సాయంకాలం విడిదిలో నలుగురి మధ్య మాట్లాడుతున్న రాజయ్యతో మీసాలయ్య, ''బావగారూ, ఒకసారి మీరు ఇలా వస్తారా? మీతో కట్నం విషయం మాట్లాడాలి,'' అన్నాడు. కట్నం అనగానే రాజయ్య తక్కున లేచి వచ్చాడు. విడిది చాలా కోలాహలంగా ఉన్నది. రాజయ్య మీసాలయ్యను లోపలి గదిలోకి తీసుకుపోయాడు.

''మా తమ్ముడు కట్నం డబ్బు...!'' అని మాట పూర్తి చేయకముందే మీసాలయ్యకు తీవ్రమైన దగ్గుతెర వచ్చింది. అతను దగ్గుతూనే మంచినీళ్ళు కావాలని రాజయ్యకు సైగచేశాడు.

రాజయ్య ఇవతలికి వచ్చి, చెంబుతో నీళ్ళు సేకరించి, మళ్ళీ గబగబా గదిలోకి వెళ్ళాడు.

మీసాలయ్య మంచినీళ్ళు తాగి, కొంచెం తేరుకుని, ''కట్నం డబ్బు ఇప్పుడే పట్టుకు రమ్మంటారా అని మా తమ్ముడు అడగ మన్నాడు,'' అన్నాడు.

''పట్టుకు రమ్మనండి,'' అన్నాడు రాజయ్య ఆత్రంగా.

మీసాలయ్య అక్కడి నుంచి పెళ్ళివారిం టికి వెళ్ళి, నలుగురి మధ్య ఉన్న రామ య్యను, ''బావగారూ, ఇలా వస్తారా? ముఖ్య మైన విషయం!'' అని పక్కకు పిలిచాడు.

రామయ్య మీసాలయ్యను లోపలి గది లోకి తీసుకువెళ్ళాడు.

మరి కాస్సేపటికి రామయ్య, ''మంచి నీళ్ళు! మంచి నీళ్ళు!'' అంటూ ఇవతలికి వచ్చి, ''మీసాలయ్య దగ్గుతెరతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు,'' అని, మంచి నీళ్ళతో మళ్ళీ గదిలోకి వెళ్ళాడు.

మరి కాస్సేపటికి మీసాలయ్య అందరూ చూస్తుండగా గదిలోనుంచి వచ్చి, బయటికి వెళ్ళిపోయాడు.

కొంత సేపటికి గదిలో నుంచి రామయ్య వెర్రికేక పెట్టడం వినిపించి, అందరూ వెళ్ళారు.

రామయ్య పెట్టె ముందు కూర్చుని, పెట్టెలో ఉన్న గుడ్డలూ అవీ కంగారుగా ఇవతలికి లాగుతున్నాడు.

''కట్నం డబ్బు కనబడదు! పదివేలు! వియ్యంకుడు ఇప్పుడే పంపమన్నాడట! మీసాలయ్య చెప్పి వెళ్ళాడు. మీసాలయ్య తప్ప ఈ గదిలోకి ఇంకెవరూ రాలేదు. దగ్గు వంకన నన్ను బయటికి పంపి, డబ్బు కాజే



శాడు! దొంగ! పట్టుకోండి! పట్టుకోండి!'' అంటూ రామయ్య కేకలు పెట్టాడు.

ఇంతలోనే రాజయ్య కేకలు పెడుతూ వచ్చాడు: ''ఆ మీసాలయ్య ఎక్కడ? నా సొమ్ము అయిదువేలు కాజేశాడు! దగ్గు నటించి, నన్ను అవతలకు పంపించి, కొంపతీశాడు!''

''మీసాలయ్య నా పదివేలూ కాజేశాడు!'' అని రామయ్య అరిచాడు.

''మీసాలయ్య నా అయిదువేలూ కాజే శాడు,'' అని రాజయ్య అరిచాడు.

అప్పుడుగాని మీసాలయ్య ఎవరి తాలూకు మనిషి అన్న ప్రశ్న రాలేదు. తీరా విచారిస్తే అతను ఎవరి మనిషీ కాడు!

రవి తన తండ్రిని పక్కకు పిలిచి, ''కట్నం గొడవ వద్దంటే విన్నావు కావు! ఎంత రభస జరిగిందో చూడు. నీకున్న డబ్బుయావ

గ్రహించి ఆ మీసాలవాడు నిన్ను కట్నం పేరుతో గదిలోకి తీసుకుపోయి, అయిదు వేలూ కాజేశాడు. ఇంకా నయం అడుగున ఉన్న పాతికవేలూ, నగలూ వాడి కంటపడ లేదు. ఇప్పటికే మనం నవ్వులపాలు అయిపోయాం. కట్నం మాట ఎత్తకు!'' అన్నాడు.

ఇంతలో ఎవరో ముహూర్తం సమీపిస్తున్నది అనడంతో, నలుగురూ రవిని పెళ్ళి పీటల మీద కూర్చోబెట్టేశారు.

పెళ్ళి అయిన మర్నాడు పెళ్ళివారు జట్కా బళ్ళమీద బయలుదేరారు. బండిలో కమల రవితో, ''ఆ మీసాలయ్య ఎంతపని చేశాడూ! మా నాన్న డబ్బేగాక, మామగారి డబ్బు కూడా పోవడం బాధగా ఉన్నది,'' అన్నది.

రవి నవ్వి, ''ఏ డబ్బూ పోలేదు. అదంతా నేనూ, మీ నాన్నా ఆలోచించి వేసిన పథకమే. మా నాన్న డబ్బు మనిషి, కట్నం లేనిదే పెళ్ళి జరగదని ఖచ్చితంగా చెప్పేశాడు. మీ నాన్న మమ్మల్ని సాగనంపుతూ వచ్చినప్పుడు, మా నాన్న బండివాడితో బేరమాడుతూండగా, మీ నాన్నను పక్కకు పిలిచి, ఈ ఉపాయం చెప్పాను. ఆయన ఒకంతట ఒప్పుకోలేదనుకో! మీసాలయ్య నాకు తెలిసిన వాడే! అతను తన కూతురి పెళ్ళికోసం అప్పు అడిగితే మా నాన్న ఇవ్వలేదు. నేను ముందే పెట్టెలో నుంచి అయిదువేలు తీసి రహస్యంగా మీసాలయ్యకు ఇచ్చేశాను. మీసాలయ్య తన మీద అందరికీ అనుమానం కలగడానికే దగ్గ తెచ్చిపెట్టుకున్నాడు. మీ నాన్న దగ్గిర కట్నం డబ్బు ఎక్కడ ఉన్నది? తన అయిదువేలూ పోవడంతో మా నాన్న, కట్నం డబ్బు కూడా పోయే ఉంటుందని నమ్మేశాడు,'' అన్నాడు.

''మీరు ఎంత మంచివారు! కట్నం లేకుండా నన్ను చేసుకున్నారు. కాని, పాపం, మీసాలయ్య లోకం దృష్టిలో దొంగ అయి కూర్చున్నాడే!'' అన్నది కమల.

''మీసాలయ్య వెర్రివాడు కాడు. అతని అసలు పేరు గుండయ్య. ఆ మీసాలూ, జులపాలూ పెట్టుడువి. ఎంతచెడ్డా నాటకాల్లో వేషాలు వేసేవాడు కావటాన గొంతు కూడా మార్చాడు. తన కొడుక్కు ఉద్యోగం రాగానే అయిదువేలూ ఇచ్చేస్తాడు,'' అన్నాడు రవి.



# అజేయుడు గరుడుడు!

ఆదిత్యుడి అద్భుత శక్తులు చూసిన ధీరసేనుడు అతడి శరణు జొచ్చి అతణ్ణి సూర్యపురికి వెంటబెట్టుకుని వెళ్ళాడు. కొండ గుహలోని నరేంద్రదేవుడు చెడ్డకలలు రావడంతో హడలిపోయాడు.

నరేంద్రదేవుడు వివరించిన కలల గురించి భూతవైద్యుడు విన్నాక...

అయ్యా! తమరు తమ కుమారుణ్ణి చంద్రపురికి రాజును చేయాలని విచారపడుతున్నారు. కొంచెం ఓర్పు వహించండి. మహాయజ్ఞం చేయడానికి ఇక మూడు పౌర్ణములు మాత్రమే ఉన్నాయి.

భూతవైద్యుడు తాను చెబుతున్నది పూర్తిచేసేలోగా...

ఏమిటా భయంకరమైన వింత ధ్వని?

అవును. నాకూ అది వినిపించింది. అది గుడి నుంచి వచ్చింది.



గద్దల ఆహుతి సగంలోనే ఉన్నది. పొగనుంచి నాగబంధు రూపం ఏర్పడి వెలుపలికి వచ్చింది.

భూతవైద్యుడు, నరేంద్రదేవుడు, మరి కొందరు అటుకేసి పరిగెత్తారు.




నరేంద్రదేవుడు వివరించింది కేవలం కల కాదు. అది మునుముందు జరగబోయేది. దానినొక హెచ్చరికగా తీసుకోండి! గరుడుడు మళ్ళీ విజృంభించవచ్చు. త్వరగా హతమార్చాలి...


పొగ మెల్లగా అదృశ్యమైపోయింది.
రవీంద్రా! వెంటనే వజ్రపురిలోని నా మిత్రుడి వద్దకు వెళ్ళు. అతడు ఆదిత్యుణ్ణి బంధించి ఇక్కడికి ఆహుతికి తీసుకురావాలి.
అలాగే, ఇప్పుడే వజ్రపురికి బయలుదేరుతాను నాన్నా!


అక్కడ వీరబాహు సూర్యనగరుకు వచ్చాడు. అతణ్ణి ఆదిత్యుడున్న కోటకి తీసుకువెళ్ళారు.


ఆదిత్యా, మహారాజుగారు నీకు ఆశీస్సులు పంపారు. యువరాణి అరుణ నీక్షేమం అడగమన్నది.


ఈయనే సూర్యపురి సేనాధిపతి ధీరసేనుడు.


మన సరిహద్దులు కట్టుదిట్టమైన కాపలాలో ఉన్నది.
వజ్రపురిని ముట్టడించడానికి వ్యూహరచన చేస్తున్నాము.
చంద్రపురికి సాయం అందించడానికి సూర్యపురి అంగీకరించింది.


సరిహద్దుల నుంచి వజ్రపురి తన సేనలను ఉపసంహరించుకునేలా చేయాలని మేము ఆలోచిస్తున్నాము.
ప్రస్తుతం వజ్రపురి దృష్టి చంద్రపురి మీద ఉన్నది. మనం వజ్రపురిని ముట్టడించవచ్చు.
అవును. అది చక్కని వ్యూహమే.


వీరబాహూ, రక్తపాతం జరగకూడదని ఆశిస్తున్నాను.
రాజగురువు చెప్పిన విషయం గుర్తున్నదా?


రేపు గ్రహాలు స్వస్థానాలకు చేరుతాయి. తప్పక మనకు విజయం సమకూరుతుంది. సరే, ఇకనేను బయలుదేరుతాను.


ధీరసేనుడు కోట ద్వారం వరకు వెళ్ళి వీరబాహును సాగనంపాడు.
సేనాధిపతీ! ఆదిత్యుణ్ణి జాగ్రత్తగా చూసుకోండి.


మరునాడు, సూర్యపురి సేనలు ధీరసేనుడు-ఆదిత్యుల నాయకత్వంలో వజ్రపురికేసి బయలుదేరాయి. కోటను సమీపిస్తూండగా...


నువ్వు కోటను ఎడమవైపు నుంచి చుట్టుముట్టు. నేను కుడివైపు నుంచి సేనలతో చుట్టుముడతాను...
ఇరువైపుల నుంచీ సేనలతో ద్వారాల వద్ద కలుసుకుందాం.


సూర్యపురి సేనలు రెండు జట్టులుగా విడిపోయి వజ్రపురి కోటను చుట్టుముట్టాయి.




కోట ద్వారం వద్ద..
అయ్యో! చంద్రపురి రవీంద్రదేవుడు వచ్చాడు.
ఎవరినీ వెలుపలికి వెళ్ళడానికి అనుమతించకండి.


యువరాజా, భటుడు చెప్పింది విన్నారు కదా!
మనం కోటను పట్టుకోవడానికి ఇంకొక కారణం!


ఆదిత్యుడు, ధీరసేనుడు కోట ద్వారం వద్ద కలుసుకున్నారు.
ఏమాత్రం ఎవరూ అడ్డుకోలేదు. చాలా ఆశ్చర్యంగా ఉంది!
హఠాత్తుగా దండెత్తి దిగ్భ్రాంతి కలిగించాము కదా?


కోటలోపల, రవీంద్రదేవుడు రాజు విక్రమసింహుడు, మంత్రి పుష్పరాజ్‌తో మాట్లాడుతున్నాడు.
చంద్రపురి మీద దాడి జరపడంలో ఏమాత్రం జాప్యం జరిగినా, ఆదిత్యుడు మనందరికీ ప్రమాదకారుడు కాగలడని మా నాన్న మిమ్మల్ని హెచ్చరించమన్నాడు.


చంద్రపురికి భద్రతావలయం పకడ్బందీగా ఉందని తెలిసింది.
మనకు విజయం తథ్యం అని తెలిసినప్పుడే మా సేనలు దండెత్తి వెళ్ళగలవు.


తన తండ్రి వ్యక్తిగత అనుభవాలను రవీంద్రదేవుడు వివరించాడు...
ఆదిత్యుణ్ణి పట్టి బంధించి బలికి తీసుకురావాలి. మొదట అతన్ని రూపుమాపాలి. అప్పుడే తక్కిన పథకాలు సఫలమవుతాయి.


పుష్పరాజ్ రవీంద్రదేవుడికి నమ్మకం కలిగేలా మాట్లాడాడు.
ఈపాటికి ఆదిత్యుడు సూర్యపురి సేనలకు చిక్కి ఉంటాడనే భావిస్తున్నాను. నా మిత్రుడు ధీరసేనుడు అతన్ని గుహలకేసి నడిపిస్తూంటాడు.


ఒక భటుడు పరిగెత్తుకు వచ్చాడు.
ప్రభూ! సూర్యపురి సేనలు మన కోటను ముట్టడించాయి. చంద్రపురి యువరాజు, సేనాధిపతితో కలిసి సేనలను నడిపిస్తున్నాడు.
ఆదిత్యుడు కోట ద్వారం వద్ద ఉన్నాడా?
ధీరసేనుడు మనకెలా ద్రోహం చేశాడు?
ఇప్పుడు మనం తప్పించుకోలేము!

-(ఇంకావుంది)

మన వారసత్వ స్థలాలు

# హుమయూన్ మసీదు



రెండవ మొగలు చక్రవర్తి హుమయూన్ మరణించినప్పుడు ఆయన సతీమణి హమీదా బాను బేగం, భర్తకు గొప్ప మసీదు నిర్మించాలని ఆశించింది. హీరత్ నుంచి సుప్రసిద్ధ భవన నిర్మాణ శిల్పకారులను రప్పించింది. తండ్రీ కొడుకులైన ఆ శిల్పకారులే భవన రూపాన్ని రూపొందించారు. 1562లో నిర్మాణం ప్రారంభమై, పూర్తికావడానికి ఎనిమిదేళ్ళు పట్టింది.

నిర్మాణం విలక్షణంగా ఉండడానికి నల్ల, పసుపు రాళ్ళతోపాటు ఎర్ర సున్నపురాయిని కూడా ఉపయోగించారు. చతురస్రాకార ఉద్యానవనం చుట్టూ ఎత్తయిన గోడలు నిర్మించబడ్డాయి. ఉద్యానవనం మధ్య ఉన్నతమైన వేదిక మీద మసీదు చాలా గంభీరంగా కనిపిస్తుంది. రాగి గోపుర శిఖరంతో అందమైన చలవరాతి బురుజులు ఉన్నాయి.

ఈరకం మొగల్ నిర్మాణ శిల్పకళలో ఇదే ప్రథమం. ఉత్తరోత్తరా తాజ్ మహల్ నిర్మాణానికి సైతం ఇదే ప్రేరణ కలిగించింది. మసీదుకు చుట్టూ ఉన్న ఉద్యానవన్నాన్ని 'చార్ బాగ్' అంటారు. ఇది నాలుగు చతురస్రాలుగా ఎత్తయిన బాటలు, నీటి కాలువల చేత విడదీయ బడి ఉన్నది. ఈరకం ఉద్యానవన-మసీదు భారత ఉపఖండంలోనే ఇదే మొదటిది.

ఈ భవన ప్రాంగణంలోనే హమీదా బాను బేగం మసీదు, మరి కొందరి పాలకుల మసీదులు ఉన్నాయి.

1993లో ఇది ప్రపంచ వారసత్వస్థలంగా గుర్తించబడింది. ''మొగల్ నిర్మాణ శిల్పకళకు మొట్టమొదటి సరైన ఉదాహరణగా ఉండడం వల్ల దీనిని ప్రత్యేక నిర్మాణశిల్పకళా ప్రాముఖ్య తగల'' మసీదుగా యునెస్కో పేర్కొన్నది.



## చలనచిత్రంగా రూపొందిన పిల్లల ఆట

సహిపుల్ మండల్‌కు ఇప్పుడు పధ్నాలుగేళ్ళు. మూడేళ్ళ వయసులో తండ్రి చనిపోయాడు. తల్లి ఇంటింటా పనులు చేసి బిడ్డను కాపాడేది. కొంచెం పెద్దవాడయ్యాక సహిపుల్, ఊరివాళ్ళ మేకలను, పశువులను మేప వలసి వచ్చింది. ఎంత కష్టపడినా బడికి పోలేకపోయాడు. ఇది పనికాదనుకుని తల్లి బిడ్డను కొల్‌కతాలోని అనాథ శరణాలయంలో చేర్పించింది. దానిని సెంటర్ ఫర్ కమ్యూనికేషన్ అండ్ డెవెలప్‌మెంట్ నిర్వహిస్తున్నది. సహిపుల్ పాఠశాలలో చక్కగా చదివేవాడు. ఆట పాటలలోనూ ఆసక్తి పెరిగింది. ఒకనాడు పిల్లలు ముఖాలకు వన్యమృగాల తొడుగులు తొడుక్కుని ఒక ఆటను కేంద్ర కార్యదర్శి స్వపన్ ముఖర్జీ సమక్షంలో ప్రదర్శించారు. దానిని చూసిన ఆయన వన్యమృగాలే పాత్రలుగా ఒక నాటిక రాసి ఇచ్చాడు. పాత్రలకు సహిపుల్ కాగితాల, ఆకుల దుస్తులతో రూపం కల్పించాడు. ఇప్పుడు నాటకం మరింత రక్తికట్టింది. దానిని ఒక చిత్రంగా రూపొందిస్తే బావుంటుందనుకుని సహిపుల్ దర్శకత్వంలో రెండు రోజులు రిహార్సల్స్ చేశారు. అంతే 12 నిమిషాల నిడివితో 'ఆమ్రా' అనే చిత్రం తయారయింది. దానికి దర్శకత్వం వహించడంతోపాటు కొంతవరకు కెమెరా చిత్రీకరణ కూడా చేశాడు సహిపుల్. చూసినవారందరూ మెచ్చుకున్నారు. అంతే కాదు. ఇటలీ నేపిల్స్‌లో జరిగిన కిడ్స్‌ఫర్ కిడ్స్ ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో ఉత్తమ చిత్రం అవార్డు అందుకున్నది. చికాగో ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో 'క్రిటిక్స్' అవార్డ్ అందుకున్నది. రెండూ 2005లోనే జరిగాయి. అడవిలోని మృగాలన్నీ తమలో తాము గొడవలు లేకుండా ఉంటూ, తమను నాశపరచడానికి అడవిలోకి అడుగుపెట్టేవారిని ఐకమత్యంతో ఎదుర్కోవాలి అని నిర్ణయించడమే ఈ చిత్ర కథాంశం. ప్రస్తుతం ఎనిమిదవ తరగతి చదువుతూన్న సహిపుల్ తదుపరి చిత్రం కోసం ప్రణాళిక సిద్ధం చేస్తున్నాడు.

---

### చందమామ ఇండియా క్విజ్ - 9 (అక్టోబర్ '07) విజేతలకు అభినందనలు:

1. ఎమ్.కె. చంద్రహాసన్, యాప్రాలు, రంగారెడ్డి జిల్లా - 500 087 (ఆం.ప్ర)
2. నేమాన కమల, శ్రీకాకుళం - 532 001 (ఆం.ప్ర)
3. ఎమ్.ఎస్. హేమలత, మదనపల్లె, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర)
4. ఓరుగంటి శ్రీ చరిత, సంతోష్‌నగర్, కర్నూలు- 518 003 (ఆం.ప్ర)
5. ఎ. వంశీ వర్ధన్‌రెడ్డి, మదనపల్లె, చిత్తూరు జిల్లా - 517 325 (ఆం.ప్ర)

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### క్యాలండర్లు-సంఖ్యలు



గణితశాస్త్రమా? ఖగోళ శాస్త్రమా? ఏది ముందు? ఏది వెనక? అని ఆలోచించినప్పుడు-ఆకాశం కేసి చూసి సమయం తెలుసుకోవాలన్నా అందుకు అంకెలు లెక్కలు కావాలి గనక, గణితమే మొదటిదనిపిస్తుంది.

కేవలం చిన్న చిన్న లెక్కలు మాత్రమే కాకుండా, కోణాల గురించి కూడా వేనవేల సంవత్సరాల నాడే మనిషికి తెలుసు అనడానికి ఆధారాలున్నాయి. ఎందుకంటే క్రీ.పూ. 2000నాడే ఇంగ్లాండులో 'స్టోన్‌హెంజ్' నిర్మించబడింది. మొదట కోణాల నెలా కనుగొని వివరించారన్నది చాలా ఆశ్చర్యం కలిగించే విషయం.

## మన పరిసరాలు

### వాము చేసే మేలు



దేశవ్యాప్తంగా అన్ని ప్రాంతాలలోనూ వాము పెరుగుతుంది. కొత్తిమిరి చెట్టులా కనిపించే వాము మన దేశానికి చెందినదే. ఇందులో చాలా ఔషధ గుణాలు ఉన్నాయి. ముఖ్యంగా అజీర్తి కలిగినప్పుడు వాము గింజలను నోట్లో వేసుకుంటారు. నోట్లో వేసుకోగానే ఎంతో ఘాటుగానూ, చేదుగానూ అనిపించి నాలుకను జివ్వుమనిపించి కొంతసేపు మొద్దుబారేలా చేస్తుంది. గాలి జొరబడని సీసాలో వేసి వుంచినట్టయితే ఇవి ఎన్నాళ్ళయినా చెడకుండా ఉంటాయి.

వాము ఆకులనూ, గింజలనూ కూడా రకరకాల ఔషధాలలో ఉపయోగిస్తారు. వీటికి పిత్తాన్ని తగ్గించి, జీర్ణశక్తిని పెంచే గుణం ఉందని ఆయుర్వేద వైద్యులు చెబుతారు. కాలేయం, జీర్ణాశయం, చిన్న ప్రేవుల వ్యాధులకు కూడా పనిచేస్తుందంటారు. ఒక టీస్పూన్ వాము పొడిని, చిటికెడు రాతి ఉప్పుతో కలిపి తీసుకుంటే ఎంతటి అజీర్ణమైనా తగ్గిపోతుంది. వాము, సోంపు, ఉప్పు నెయ్యితో కలిపి మూడు పూటలు తీసుకుంటే బాగా ఆకలి వేస్తుందని వైద్యులు చెబుతారు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



T. KARNAN



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018.

## అభినందనలు

అక్టోబర్‌నెల పోటీ ఫలితాలు
ఎ. వినీల్ కుమార్
తం.పే: ఎ. మదన్ మోహన్
ఆఫీసర్, ఆంధ్రా బ్యాంక్,
పీలేరు, చిత్తూరు జిల్లా
(ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : రమ్యమైన హస్తకళ!
రెండవ ఫోటో : రంగులతో జీవకళ!!

## సమాధానాలు :

1. గ్యానీజీ; 2. క్రీ.పూ. 599. బీహార్ వైశాలి సమీపంలోని కుందగ్రామ్‌లో; 3. అంజుమాన్ (అగ్ని ఆలయం); 4. జాతక కథలు; 5. మహమ్మద్ ప్రవక్త మక్కా నుంచి మదీనాకు వెళ్ళిన 662 సెప్టెంబర్ 13వ తేదీ.

**Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,** JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : B. Viswanatha Reddi (Viswam)**

